

# సుగంధ పరిమళాల మార్గంలో

ఏదైనా సాహసం చెయ్యాలని ఉబలాటపడుతూన్న చందనకు చక్కటి అవకాశం లభించింది. సెలవులలో కుటుంబంతో కలిసి, కూర్గ్‌కు వెళ్ళినప్పుడు, ఎవరికీ తెలియకుండా సరదాగా దాపులనున్న అడవిలోకి వెళ్ళింది. అక్కడున్న ఒక గంధపు వృక్షం మాట్లాడేంతవరకు, తాను గంధపు వృక్షాల అరణ్యంలో ఉన్నట్టు చందనకు తెలియదు.

ల్యాటిన్ భాషలో శాంటా లుమ్ అల్బమ్ అని పిలువ బడే గంధపు వృక్షాలు, కర్నాటక, తమిళనాడు రాష్ట్రాలలో విరివిగా పెరుగు తాయని మీకు తెలుసా? కర్నాటకలోని ధార్వాడ్, షిమోగా, చిక్‌మగళూరు, మెర్కారా, మైసూరు, బెంగుళూరు ప్రాంతాలలో చందనం ఎక్కువగా ఉత్పత్తి అవు తున్నది.










గంధపు చెట్లు అంత ప్రత్యేకమైనది ఎందుకో తెలుసా? అది మనకు ఎంతగానో ఉపయోగపడుతోందిగనుకే! గంధపుచెక్కల ఉపయోగాలు కొన్ని ఇక్కడ చిత్రాలలో చూపబడ్డాయి. వాటిని మీరు గుర్తించగలరా?

మైసూర్ శాండల్ సంస్థ గత 80 సంవత్సరాలకు పైగా చందనం శ్రేష్ఠతను మీ ఇళ్ళల్లోకి తీసుకువస్తోంది!












A 
ACTIVE

B 
BUZZ BOSS

C 
CADET DX

D 
DEVIL DX

E 
ELEPHANT

F 
FISH

G 
GIRAFFE

H 
HEN

I 
INSECT

J 
JOKER

K 
KIDD DX

L 
LI'L ANGEL
LAMBADA LIMBO

M 
MISSILE MISS INDIA Jr

N 
NEST

O 
ORANGE

P 
PIRANHA

Q 
QUEEN Jr

R 
ROBO COP

S 
SPARKY SALSA

T 
TERMINATOR




V W

**The largest range of kids bikes**

**HERO CYCLES**

THE ABC OF CYCLING

HTA.5879.2001



మాతృదేవత (బే.క) 15



మన పూర్వగాథలు 25



మాయాసరోవరం 9



సావిత్రి తెలివి 67



## ఈ సంచికలో



**SUBSCRIPTION**

**For USA and Canada**
**Single copy $2**
**Annual subscription $20**
***Remittances in favour of Chandmama India Ltd.***
to
Subscription Division
CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097
E-mail : subscription@chandamama.org

చందా
ఎయిర్ మెయిల్ ద్వారా అన్నిదేశాలకు
పన్నెండు సంచికలు రూ: **900**
ఇండియాలో బుక్‌పోస్ట్‌ద్వారా రూ.**120**లు
చందా డబ్బు డిమాండ్ డ్రాఫ్ట్ ద్వారా
గానీ,మనిఆర్డర్ ద్వారాగానీ
'చందమామ ఇండియా లిమిటెడ్
పేరిట పంపండి':

ఈ పత్రికలో ప్రకటనల
కోసం సంప్రదించండి:

చెన్నయ్
ఫోన్: 044-234 7384,
234 7399

ఢిల్లీ
మోనా భాటియా
ఫోన్:011-651 5111/
656 5513/656 5516

ముంబాయి
షకీల్ ముల్లా
మొబైల్ :**98203-02880**
ఫోన్: 022-266 1599/266 1946/
265 3057



వ్యవస్థాపకులు
బి.నాగిరెడ్డి - చక్రపాణి

# మనందరి కర్తవ్యం!

ధరణి, అవని, వసుధ,పృథ్వి అంటూ నేలతల్లికి చాలాపేర్లు ఉన్నాయి. వీటిలో పృథ్వి అనే పేరుకు చాలా ప్రాముఖ్యత ఉంది. భూమికి ఈ పేరు ఎలా వచ్చిందో తెలియజేసే ఒక పురాణ కథను చూద్దాం:

ఒకానొకప్పుడు భూమిమీది ప్రజలు సుఖసంతోషాలతో జీవించేవారు. సకాలంలో వర్షాలు కురిసేవి. ప్రజలు భూమిని దున్ని రకరకాల పంటలు పండించేవారు. కృతజ్ఞతా పూర్వకంగా దేవతలకు యజ్ఞాలు చేసేవారు. కొన్నాళ్ళకు ఒక క్రూరుడు అధికారం చేపట్టి తానే దేవుణ్ణనీ, యజ్ఞయాగాదులు తన పేరుకే చేయాలనీ ఆజ్ఞాపించాడు. అతిక్రమించిన వారిని హింసించాడు. వాణ్ణి మంచి మార్గంలో పెట్టడానికి మునులు ప్రయత్నించారు. కానీ ప్రయోజనం లేకపోయింది. చివరికి వాణ్ణి హతమార్చవలసి వచ్చింది. పర్యవసానంగా పాలకుడు లేక భూమిమీద అరాచకం ప్రజ్వరిల్లింది. వానలు లేక కరువు కాటకాలు తాండవించసాగాయి.

అప్పుడు మునుల ప్రార్థనల ఫలితంగా ఒక రాజు ఉద్భవించాడు. తన బిడ్డలైన ప్రజలను ఉదాసీనపరచినందుకు భూదేవిని మందలించాడు. అయితే, భూదేవి ఈ దుస్థితికి కారణం తాను కాదనీ, ప్రకృతిని నిర్లక్ష్యం చేసిన ప్రజలేననీ వివరించింది. రాజు ప్రకృతి సంపదను పెంపొందించి, పరిరక్షించడానికి పూనుకున్నాడు. ప్రజలు ఆయన్ను అనుసరించారు. భూమి సస్యశ్యామలమయింది. ప్రజలలో సుఖశాంతులు వెల్లివిరిశాయి. ఆ రాజు పేరు పృథువు. ఆయన కారణంగానే భూమికి పృథ్వి అనే పేరు వచ్చింది!

ఈనాడు ప్రకృతిని నాశపరుస్తున్నది ఏ క్రూరపాలకుడో కాదు. ఆ దుష్టకార్యాన్ని వేరెవరో కాదు; తెలిసో, తెలియకో మనమే చేస్తున్నాం. భూమిని రక్షించడానికి మరొక పృథువు రావాలని ఎదురు చూడకూడదు. మనసుంటే మనలో ప్రతి ఒక్కరం నేలతల్లికి రక్షకులం కావచ్చు. ఎలాగా అంటారా? ప్రపంచ పర్యావరణ దినోత్సవం (జూన్ 5) సందర్భంగా ఈ సంచికతో పాటు వెలువడిన 'వసుధ' అనుబంధాన్ని చదవండి. మన అందరి కర్తవ్యాన్ని వివరిస్తుంది!

సంపాదకుడు : విశ్వం
Visit us at : http://www.chandamama.org



హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్‌లో పాల్గొని ఆకర్షణీయమైన బహుమతులు గెలుచుకోండి!

# హీరోస్ ఆఫ్ ఇండియా - 9

భారతీయ క్రీడారంగంలో గతంలోనూ, ప్రస్తుత కాలంలోనూ ఎందరో 'హీరోలు' ఉన్నారు. వారిలో ఐదుగురిని గురించి ఇక్కడ ప్రస్తావించబడింది. వారిలో మీరు ఎంత మందిని గుర్తించగలరో చూద్దాం.

అన్నీ సరైన సమాధానాలు గల మూడు ఎంట్రీలు సైకిళ్ళను బహుమతులుగా అందుకుంటాయి!

1. నేను ఇటీవల టెస్ట్ క్రికెట్‌లో 29 సెంచురీలు స్కోర్ చేసి లెజెండరీ డాన్ బ్రాడ్మన్‌కు సమంగా రికార్డును అందుకున్నాను. నేనెవరో మీకు తెలుసా?

   ---------------------------------------------

2. గత యేడాది ఆల్ ఇంగ్లాండ్ బ్యాట్మింటన్ ఛాంపియన్‌షిప్ విజేతగా సంచలనం సృష్టించాను. నేనెవరో చెప్పగలరా?

   ---------------------------------------------

3. నన్ను 'ఫ్లైయింగ్ శిక్' గా చెప్పేవారు. 1960 ఒలింపిక్స్ 400మీ. పరుగుపందెం ఫైనల్స్‌లో 4వ వాడుగా వచ్చాను. నా పేరేమిటో తెలుసా?

   ---------------------------------------------

4. 1985లో తొలిసారిగా పాల్గొని వరల్డ్ అమెచ్యూర్ బిల్లియర్డ్స్ ఛాంపియన్‌షిప్ సాధించి అతి పిన్న వయసు ఛాంపియన్‌గా పేరు తెచ్చుకున్నాను. నా పేరేమిటి?

   ---------------------------------------------

5. నా 16వ యేట 1953లో జూనియర్ వింబుల్డన్ టైటిల్ సాధించాను. నేను నాలాగే సుప్రసిద్ధుడైన కుమారుడికి తండ్రిని. నేనెవరిని?

   ---------------------------------------------

ప్రతి ప్రశ్నకు దిగువ చుక్కలతో చూపినచోట మీ సమాధానాలను స్పష్టంగా రాయండి. ఈ ఐదుగురిలో మీకు చాలా ఇష్టమైన క్రీడారంగవీరులు ఎవరు? ఎందుకు? అన్న విషయాలను పది పదాలకు మించకుండా రాయండి.

క్రీడారంగంలో నా అభిమాన హీరో

..................................................................

..................................................................

పాల్గొనేవారి పేరు: ..........................................

వయసు:............తరగతి: ..........................................

చిరునామా:..................................................

..................................................................

పిన్: ........................ ఫోన్: ........................

పాల్గొనేవారి సంతకం: ......................

తల్లి/తండ్రి సంతకం:......................

వివరాలన్నీ పూర్తిగా నింపాక, ఈ పేజీ కత్తిరించి 2002 జూలై 5వ, తేదీలోగా అందేలా ఈ చిరునామాకు పంపండి:

**హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్-9**
**చందమామ ఇండియా లిమిటెడ్**
**82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ**
**ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097.**

సూచనలు:

1. 8-14 ఏళ్ళ లోపు వయసు పిల్లలందరూ ఈ పోటీలో పాల్గొనవచ్చు.
2. ఈ పోటీకి వచ్చే అన్నిభాషల ఎంట్రీల నుంచి ముగ్గురు విజేతలు ఎంపిక చేయబడతారు. విజేతలు వారికి తగిన సైజు సైకిళ్ళు అందుకుంటారు. సరైన సమాధానాలుగల ఎంట్రీలు ఒకటికన్నా ఎక్కువ వచ్చినట్టయితే, నా అభిమాన హీరో వివరణ ఆధారంగా విజేతలు ఎంపిక చేయబడతారు.
3. న్యాయనిర్ణేతలదే తుది నిర్ణయం.
4. ఈ విషయంగా ఎలాంటి ఉత్తర ప్రత్యుత్తరాలూ జరుపబడవు.
5. విజేతలకు విషయాన్ని పోస్టుద్వారా తెలియజేస్తాము.

బహుమతులను మీకు అందజేస్తున్నవారు



# మాటకు మాట!

రామయ్య, భూమయ్య ఇరుగుపొరుగు ఇళ్ళవాళ్ళు. రామయ్యకు పుస్తకాలు సేకరించడం అంటే మహాసరదా. తన దగ్గర ఉన్నన్ని పుస్తకాలు మరెవ్వరిదగ్గరా లేవని గర్వంగా చెబుతూ మురిసిపోయేవాడు. ఒకనాడు రామయ్య ఇంటికి వచ్చిన భూమయ్య, అక్కడ అద్దాల బీరువాలో అందంగా అమర్చి ఉన్న పుస్తకాలకేసి చూస్తూ, "మీ దగ్గర మంచి మంచి పుస్తకాలున్నాయే. నాకొక పుస్తకం ఇవ్వండి. చదివి భద్రంగా తిరిగి ఇచ్చేస్తాను," అన్నాడు.

అందుకు రామయ్య, "క్షమించండి. నేను ఎవ్వరికీ పుస్తకాలు అరువు ఇవ్వను. కావాలంటే మీకిష్టమైన పుస్తకాన్ని, ఇక్కడే కూర్చుని ఎంతసేపైనా చదువుకుని వెళ్ళండి," అన్నాడు.

ఆ మాటకు భూమయ్య చిన్నబుచ్చుకున్నాడు. అయినా పైకిమాత్రం గంభీరంగా, "మంచిది. మరెప్పుడైనా తీరిగ్గా వస్తాను," అని చెప్పి వెళ్ళిపోయాడు.

ఒక వారం తరవాత భూమయ్య ఇంటికి వచ్చిన రామయ్య, "మీరు నాకొక సాయం చెయ్యాలి. మా ఇల్లంతా బూజుతో నిండిపోయింది. ఎప్పటికప్పుడు బూజు దులిపే చీపురుకర్ర కొనాలనుకుంటూ మరిచిపోతున్నాను. మీ దగ్గరుండే ఆ చీపురుకర్రొకసారి ఇచ్చారంటే, పని ముగిశాక, తిరిగి ఇచ్చేస్తాను," అన్నాడు బయటి గదిలో ఒక మూలగా ఆనించి ఉన్న చీపురు కర్రను చూపిస్తూ.

అప్పుడు భూమయ్య చిన్నగా నవ్వి, "క్షమించాలి. ఎవరికైనాసరే, చీపురు అరువిచ్చే అలవాటు నాకులేదు. అయినా, నువ్వు నాకు మరీ కావలసిన స్నేహితుడివే గనక, కావాలంటే నేనే ఆ చీపురు కర్ర పట్టుకువచ్చి, మీ ఇంట్లో బూజు దులిపి వస్తాను," అన్నాడు.

ఆ మాట విని గతుక్కుమన్న రామయ్య, వారం క్రితం పుస్తకం అరువియ్యడం విషయంలో భీమయ్యతో అంత నిర్మొహమాటంగా ప్రవర్తించినందుకు మనసులో నొచ్చుకున్నాడు.

–జి.సి.జీవి





HERO CYCLES

# యువ హీరోలకు అభినందనలు!

2001 అక్టోబర్ నుంచి 2002 మార్చ్ వరకూ చందమామలో వెలువడిన 'హీరోస్ ఆఫ్ ఇండియా క్విజ్'లలో (1-6) పాల్గొని విజయం సాధించిన యువ హీరోలను చందమామ మనసారా అభినందిస్తున్నది. ప్రాయోజితులనుంచి విజేతలు ఒక్కొక్కరూ ఒక్కొక్క హీరో సైకిల్‌ను బహుమతిగా అందుకుంటారు.

**అక్టోబర్ 2001**
వి. కౌసల్య, నాగపూర్.
ఎస్. ఆర్. రాహుల్, బెంగుళూరు.
నారాయణ్ దేవ్, భద్రాజున్, రాజస్థాన్.

**నవంబర్ 2001**
డి. బృంద, విశాఖపట్నం.
నీహా సిన్హా, ఉదయ్‌పూర్ కోర్ట్, త్రిపుర.
ప్రణీత్ ప్రకాష్ మంత్రి, అమ్రోతి.

**డిసెంబర్ 2001**
విరాల్‌కె. దావే, డ్యామ్‌నగర్, అమరేలి జిల్లా.
పి.వి.రాఘవేంద్రన్, హోసూరు.
పార్థ్‌కె. పాండ్య, వాదోదర.

**జనవరి 2002**
ఎస్. దీపక్ కుమార్, విశాఖపట్నం.
ఎల్. భావన, తిరుపతి.
బి. ఎస్. యశోద, బెంగుళూరు.

**ఫిబ్రవరి 2002**
కె. శ్రీరాం, కొల్‌కత.
శంఖా బెనర్జీ, నరోత్తమ్ నగర్, అరుణాచలప్రదేశ్.

**మార్చ్ 2002**
సోనామ్ నాగర్, ఉజ్జయిన్.
జె. జయప్రకాష్, చెన్నయ్.
ఎం. విద్యాధరి, హైదరాబాద్.

**శ భా ష్!**

# ఒటిడిసి క్విజ్ 1-7 విజేతలకు అభినందనలు!




చందమామలో 2001 సెప్టెంబర్ నుంచి 2002 వరకు వెలువడిన ఒరిస్సా టూరిజం డెవలప్‌మెంట్ కార్పొరేషన్ (ఒటిడిసి) క్విజ్ 1-7 లలో పాల్గొని విజయం సాధించినవారికి చందమామ అభినందనలు తెలియజేస్తున్నది. విజేతలు ఒక్కొక్కరూ నలుగురు కుటుంబ సభ్యులతో కలిసి ఏ **ఒటిడిసీ పాంథ నివాస్**లోనైనాసరే 3 రోజులు, రెండు రాత్రులు ఉచితంగా గడపవచ్చు.

**సెప్టెంబర్ 2001**
పరీక్షిత్ పరాగ్ గోఖలే విరార్ (డబ్ల్యు)

**అక్టోబర్ 2001**
అనిల్ అజితవ్, భువనేశ్వర్.

**నవంబర్ 2001**
దేవీప్రసాద్ నంద, జైపూర్..

**డిసెంబర్ 2001**
సోమేశ్ మిశ్రా, చిదంబరం.

**జనవరి 2002**
నిషాద్ ఎస్. కుల్కర్ణి, పూణే.

**ఫిబ్రవరి 2002**
కె. అవినాశ్, విజయనగరం.

**మార్చ్ 2002**
ఆర్య బిభాస్‌కుమార్, జైపూర్.

**విజేతలకు అభినందనలు!**



# మాయాసరోవరం

## 5

[అడవి ఏనుగుల్ని తరిమివేసిన తరవాత, మొసలి ఆకారంవాడు, చరకాచారి కోసం బయలు దేరాడు. కొండచిలువకు చిక్కి ప్రాణాపాయస్థితిలో వున్న చరకాచారిని, జయశీలుడు కాపాడి, అతణ్ణి ప్రశ్నిస్తున్న సమయంలో, మొసలి ఆకారంవాడు అక్కడికి వచ్చాడు. అతణ్ణి చూస్తూనే జయశీలుడు కత్తిపిడిమీద చేయివేశాడు. సిద్ధసాధకుడు దండం ఎత్తిపట్టుకున్నాడు. - తరువాత]

జయశీలుడూ, సిద్ధసాధకుడూ నిర్భయంగా నిలబడటమేకాక, తనను ఎదిరించేందుకు సిద్ధపడడం చూసి, మొసలి ఆకారంవాడు గతుక్కుమన్నాడు. తన వాహనాన్నీ, తన మొసలి రూపాన్నీ, చేతిలో గల వాడిశూలాన్నీ చూసి, వాళ్ళిద్దరూ ఠారుకుని, వెనుదిరిగి పారిపోతారని వాడు భావించాడు. కాని అలా జరగలేదు.

మొసలి ఆకారంవాడు శూలం ఎత్తి పట్టుకుని, పెద్ద గొంతుతో, ''మీరెవరు? ఇక్కడికి ఎందుకు వచ్చారు? ఈ భయంకరారణ్యంలో మీకేం పని?'' అంటూ జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ గద్దించి అడిగాడు.

జయశీలుడు కత్తిని ఒర నుంచి బయటికి లాగి, ''మొసలిచర్మం కప్పుకున్న నిన్ను చూస్తే నాకు నవ్వొస్తున్నది. నేనడగవలసిన ప్రశ్నలు నువ్వడుగుతున్నావు. సరే, నువ్వెవరు? ఈ అరణ్యంలోకి ఏం పనిమీద వచ్చావు? నువ్వెక్కి వున్న ఏనుగుక్కూడా ఏదో వింత చర్మం తొడుగు వేసినట్టున్నావు! ఈ కపట నాటకమంతా ఎందుకాడుతున్నావు?'' అని అడిగాడు.



''ఛీ, అల్ప మానవుడి నుంచి ఇంత ధిక్కారమా? నేను సహించను,'' అంటూ మొసలి ఆకారంవాడు, జలగ్రహాన్ని అదిలించబోయేంతలో, అంతవరకూ అతడి తోక పట్టుకుని వణికిపోతున్న వీరనారాయుడు మొండి ధైర్యం తెచ్చుకుని, మొసలి ఆకారంవాడి శూలం వున్న చేతిని, తన రెండు చేతులతో గట్టిగా పట్టుకుని, 'మొసలిదొరా, కాస్తంత నిదానించు. నువ్వెంత వీరుడివైనా డొక్కలో ఇంకా గుచ్చుకుని వున్న కత్తిని మరిచిపోకు. ఆ ఇద్దరితో సమాధాన పడటం మంచిది. చరకాచారిగారు వైద్యానికి పనికివస్తుందని, కొండచిలువను పట్టబోయి చిక్కులో పడినట్టున్నది,'' అన్నాడు.

వీరనారాయుడు ఇలా అన్న తరవాత గాని, మొసలి ఆకారంవాడు పరీక్షగా చరకాచారికేసి చూడలేదు. ఇప్పుడు చరకాచారి లేచి నిలబడేందుకు ప్రయత్నిస్తూ, మూలుగుతున్నాడు. అతడి పక్కనే నేలమీద తల తెగి పడివున్న కొండచిలువ గిలగిల కొట్టుకుంటున్నది.. ఇదిచూసి మొసలి ఆకారంవాడు ఒక తృటికాలం నిశ్చేష్టుడై, ''చరకాచారీ, నాకు వైద్యం చేసేందుకు కొండ చిలువను పట్టుకోబోయి, చిక్కులో పడ్డావా? నీకు కావాలంటే, ఏనుగులనే మింగగలిగినంత పెద్ద కొండ చిలువలను, నా శూలానికి గుచ్చి తెచ్చి, ఇచ్చి వుండేవాడినే!'' అన్నాడు.

చరకాచారి, ''మొసలి ప్రభూ!'' అంటూ ఏమోచెప్పబోయి, గొంతు పెగలక, చేతెత్తి అతడికి జయశీలుణ్ణీ, సిద్ధసాధకుణ్ణీ చూపించాడు.

మొసలి ఆకారంవాడు, వాళ్ళిద్దరికేసీ కళ్ళెర్రచేసి చూస్తూ, ''మీరింకా ఇక్కడే వున్నారా? ఊఁ, బతకాలని వుంటే, శూలానికీ, నాకంటికీ, అననంత దూరం పారిపొండి,'' అన్నాడు.

ఆ వెంటనే జయశీలుడు కత్తి ఎత్తి ముందుకు ఒక అడుగు వేశాడు. అది చూసి వీరనారాయుడు చిన్నగా ఒక కేకపెట్టి, జయశీలుడితో, ''శూరకత్తి, చినబాబూ, కాస్త ఆగు! ఈ మొసలిదొరమీద కత్తితో కలబడటం అంటే, నిస్సహాయుడైన మనిషిని హత్య చేయటంతో సమానం. ఆయన డొక్కలో దిగి వున్న కత్తిని చూశావా? దాన్ని బయటికి లాగకపోతే, నెత్తురు గడ్డకట్టి మరణించి తీరుతాడు,'' అన్నాడు.

''వీడు అంత సుఖంగా చావటం నాకిష్టం లేదు. వీడి డొక్కలో విరిగిన కత్తి మిగతాభాగం కనకాక్షరాజుగారి దగ్గర వున్నది!'' అన్నాడు జయశీలుడు.

జయశీలుడు మాట పూర్తిచేసే లోపలే మొసలి ఆకారంవాడు పెద్దగా హుంకరించి, శూలం పైకెత్తి, "ఒరే, అలా అయితే, నేనెవరైందీ నీకు తెలుసన్నమాట!" అన్నాడు.

"తెలుసు. అరణ్యంలో రాజకుమారుణ్ణీ, కుమార్తెనూ అపహరించుకుపోయినవాడివి నువ్వు! నీ డొక్కలో విరిగివున్న కత్తి రాజకుమారుడు కాంచనవర్మది," అన్నాడు జయశీలుడు.

"అంత తెలిసినవాడివి నువ్వు బతకటం క్షేమం కాదు," అంటూ మొసలి ఆకారంవాడు తన వాహనాన్ని అదిలించి, జయశీలుడి కేసి దూకించబోయేంతలో, పక్కనేవున్న వీరనారాయుడు శూలాన్ని రెండు చేతులతో వడిసి పట్టుకుని జలగ్రహం మీదినుంచి పట్టు తప్పి, శూలంతోపాటు దభీమంటూ కింద పడిపోయాడు.

జయశీలుడు అదేక్షణంలో మెరుపులా ఎగిరి జలగ్రహం మీదికి పోయి, వెనకనుంచి మొసలి ఆకారంవాడి మెడ పట్టుకున్నాడు. ఈ లోపల సిద్ధసాధకుడు కిందపడిన శూలాన్ని చేతిలోకి తీసుకుని, "జై, మహాకాళా!" అంటూ కేకపెట్టాడు.

మొసలి ఆకారంవాడు, ఈ విధంగా కన్ను మూసి తెరిచేంతలోగా తన శూలాన్ని పోగొట్టుకోవడమేగాక, నిరాయుధుడుగా తన శత్రువుకు దొరికిపోయాడు.

జయశీలుడు కత్తిని మొసలి ఆకారంవాడి మెడకు ఆనించి, "ఒరే, నీ పేరేమిటి? నువ్వు లొంగిపోతావా లేక మెడ నరకమంటావా?" అని అడిగాడు.

మొసలి ఆకారంవాడు "ఒరే, మనిషీ, నీ సాహసానికి మెచ్చాను," అన్నాడు.



జయశీలుడు అతడి మెడ పట్టుకుని గట్టిగా ఊపి, "ఒరే, మొసలి తొడుగూ, నీ పేరేమిటి? లొంగిపోయి మర్యాదగా నావెంట హిరణ్యపురం రాజుగారి దగ్గరకు వచ్చి, ఆయన పిల్లల్ని ఎక్కడ దాచావో చెపుతావా?" అన్నాడు.

"నా పేరు మకరకేతు. రాజుగారి పిల్లలు ఎక్కడ వున్నదీ చెప్పేందుకు రాజుగారిదగ్గరకు పోవటం ఎందుకు? ఆసంగతి నీకేచెపుతాను," అన్నాడు మొసలి ఆకారంవాడు.

అయినా జయశీలుడు, మకరకేతుడితో, "కేతూ, నీ సంకరజాతి ఏనుగును వెనక్కు తిప్పి, హిరణ్యపురం దారి పట్టించు. దారిలో పారిపోయేందుకేమైనా కుటిల ప్రయత్నం చేశావో, ఒక్క వేటుకు నీ మెడ నరికేస్తాను," అన్నాడు.

మకరకేతు కిక్కురుమనకుండా జలగ్రహాన్ని అదిలించి వెనక్కు తిప్పాడు. సిద్ధ



సాధకుడు గబగబా ఏనుగు దగ్గరకుపోయి, ''జయశీలా, నేనూ వస్తున్నాను. కాస్త చేయి సాయం ఇచ్చి, నన్ను ఏనుగుపైకి లాగు,'' అన్నాడు.

జయశీలుడు, సిద్ధసాధకుణ్ణి ఏనుగు మీదికి గుంజాడు. ఏనుగు ఇక కదలబో యేంతలో, వీరనారాయుడూ, చరకాచారీ చప్పట్లు చరుస్తూ, ''అయ్యలారా, ఆగండి! మాపై కనికరించండి! ఇక్కడికి మా గ్రామం దగ్గర్లోనే వున్నా, అక్కడికి చేరాలంటే, ఈ కీకా రణ్యం దాటాలి. దారిలో పులీ, ఎలుగూ, తోడేలూ!'' అన్నారు.

''మీకొచ్చిన ప్రాణభయం ఏమీలేదు. మీ ఇద్దరూ, ఈ దుర్మార్గుడికి వైద్యం చేసే ప్రయత్నంలో వుండబట్టే, వీడు మాకు దొరి కాడు. ఏనుగు మెల్లిగా నడుస్తుంది, వెనగ్గా మీరు రండి,'' అన్నాడు జయశీలుడు.

అందరూ హిరణ్యపురం దిక్కుకేసి బయ లుదేరారు. నాలుగైదు నిమిషాల నిశ్శబ్దం తరవాత చరకాచారి గట్టిగా ఓమారు గొంతు సవరించుకుని, ''జయశీల ప్రభూ, మాదొక మనవి,'' అన్నాడు.

జయశీలుడు కొంచెం ఆశ్చర్యపడి, ''ఏమి టామనవి?'' అని అడిగాడు.

''నేనూ, ఈ వీరనారాయుడూ పొద్దుటి నుంచి, ఈ మొసలితొడుగువాడికి వైద్యం చేసేందుకు నానా హైరానా పడ్డాం. మరొక మరొక మనిషైతే, అంత పొడవుకత్తి డొక్కలో దిగబడినందుకే క్షణాల మీద చచ్చేవాడు. కాని, వీడు ఆ విరిగినకత్తిని, ఏదో ఆభరణంలా ధరించినట్టు కనబడుతున్నాడు. పైగా, వాడి నాడి పరీక్షించాను; వాడి శరీరంలో ప్రవహిస్తు న్నది శీతలరక్తం. వీడేదో జలప్రాణి!'' అన్నాడు చరకాచారి.

''అంటే వీడు, నీటిలోనూ, నీటి బయటా కూడాబత్గగలిగే, ఏకప్పలాంటిజీవో అంటావా? కనకాక్షరాజుగారికి వీడితో పనితీరిన తరవాత, వీడినీ, వీడి వాహనాన్నీ మీకు బహుమతిగా ఇప్పిస్తాను. అప్పుడు వీడిమీద, ఏవైనా వైద్య పరిశోధనలు చేద్దువుగాని, చరకాచారీ,'' అన్నాడు జయశీలుడు.

ఈ సంభాషణ విని మకరకేతు పళ్ళు పటపట కొరికాడు. జయశీలుడు కత్తిని వాడి కంఠం మీద గట్టిగా ఆనించి పట్టుకుని, ''ఓరేయ్, మకరకేతూ, జాగ్రత్త! ఏదైనా దుస్సాహసానికి పూనుకున్నావో, మొండెం నుంచి తల తెగి కిందపడుతుంది,'' అన్నాడు.

అంతలో పక్కనే ఉన్న ఒక పెద్ద చెట్టు కొమ్మల్లో నుంచి రివ్వుమంటూ ఒక బాణం

వచ్చి, మకరకేతు భుజంలో దిగింది. బాణం దెబ్బ తింటూనే మకరకేతు బాధతో పెద్దగా ఒకకేకపెట్టి, "జయశీలా, ఇది అన్యాయం! నీకు లొంగి, నీ ఆజ్ఞల్ని శిరసావహిస్తున్న నన్ను, శూలంతో పొడుస్తావా?" అన్నాడు.

హఠాత్తుగా బాణం వచ్చి మకరకేతుకు తగలగానే జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా ఉలిక్కిపడ్డారు. జయశీలుడు తలెత్తి చెట్టుకొమ్మల్లోకి చూసేంతలో, అక్కడినుంచి వికవికమనే నవ్వుతో, "ఒరే మొసలిముచ్చూ! నేను కొట్టిన అడవికోడిని దొంగిలించుకు పోతావా? నువ్వు భూతానివి కాదు; మనిషివే. ఆ సంగతి తెలిసిపోయింది. ఇదుగో, ఈ బాణం నీ గుండెల్లో దిగబోతున్నది," అన్న మాటలు వినిపించినై.

జయశీలుడూ, సిద్ధసాధకుడూ కూడా ఆ గొంతు గుర్తించారు. ఆ మాట్లాడుతున్నవాడు బోయ భీమన్న. వెంటనే సిద్ధసాధకుడు తన మంత్రదండాన్ని పైకెత్తి, "ఒరే, బోయభీమన్నా, ఇంకో బాణం వదిలావో, నిన్ను మహాకాళు డికి ఆహారంగా వేస్తాను. చెట్టు దిగిరా," అంటూ కేకపెట్టాడు.

"ఎవరది? రాజుగారి దయ్యాలపోతా?" అంటూ బోయ భీమన్న కీచుమన్నాడు.

"నేను దయ్యాలపోతును కాదు, మాంత్రి కుణ్ణి., సిద్ధసాధకుణ్ణి. నోరు మూసుకుని నువ్వు ఈ క్షణమే చెట్టుదిగి వస్తావా లేక, మంత్రం ప్రయోగించి, అక్కడే కొమ్మల్లో నిలువునా మంటల్లో కాల్చి వేయమంటావా?" అన్నాడు సిద్ధసాధకుడు.

"నన్ను బాణంతో కొట్టినవాడు, ఆ బోయ వెధవా? ఎంత గొప్ప మాయాసరోవరేశ్వరుడి బంటుకు, ఎంత దుర్దశ పట్టింది! వాణ్ణి చెట్టుతోపాటు జలగ్రహం చేత నేల పడగొ ట్టించి, సున్నంలోకి ఎముక లేకుండా తొక్కి స్తాను," అంటూ మకరకేతు, జలగ్రహాన్ని గట్టిగా హెచ్చరించాడు.

జయశీలుడు వారించే లోపలే జలగ్రహం ఒకసారి ఘీంకరించి,దూకుతూపోయి బోయ భీమన్న ఎక్కివున్న చెట్టును తలతో ఒకసారి ఢీకొట్టి, తొండంతో పట్టుకుని కూకటి వేళ్ళతో పాటు పెకలించింది. చెట్లకొమ్మల్లో వున్న బోయ భీమన్న కిందూ, మీదూ అవుతూ ఆర్త నాదాలు చేయసాగాడు. - (ఇంకావుంది)



# వంటవాడి సంస్కారం

కొత్తపల్లి జమీందారు రామనాధం కొడుకు వినయుడు. అతడు ఎప్పుడూ తన తోటి యువకులతో తిరిగి తిరిగి రాత్రి బాగా ఆలస్యంగా ఇంటికి చేరేవాడు. ఒక్కడే కొడుకు కనక తల్లి సూర్యమణి, అతడు వచ్చేవరకూ మెలుకువగా వుండి, వంటవాడు విఘ్నేశం చేత భోజనం పెట్టించేది. విఘ్నేశం దీపం ముందు కూర్చుని వినయుడు వచ్చేవరకూ ఏదో ఒకటి చదువు తూండేవాడు.

ఒకనాడు వినయుడు బాగా పొద్దుపోయాక వచ్చి, విఘ్నేశం చదువుతూండడం చూసి, "అలా బాగా చదువుతూండు; మంచి సంస్కారం అబ్బుతుందిలే!" అన్నాడు వేళాకోళంగా.

వెంటనే విఘ్నేశం, "బాబూ! కేవలం చదువుకుంటే సంస్కారం వస్తుందన్న నమ్మకం నాకు లేదు. అమ్మగారిని చూడండి! మీరు రాత్రి ఎప్పుడు వస్తారా అని ఎదురు చూస్తూంటుంది; అది మాతృప్రేమ! మళ్ళీ తెల్లవారు జామున లేచి, నాన్నగారికి కావలసినవన్నీ అమరుస్తారు, తన ఆరోగ్యం కూడా లెక్కచేయకుండా. ఈ సంస్కారం అమ్మగారికి ఏ చదువులవల్ల వచ్చింది?" అన్నాడు.

ఈ మాటలు కొరడాదెబ్బల్లా తగిలాయి, వినయుడికి. తనవల్ల తల్లికీ, వంటవాడిక్కూడా రోజూ ఇబ్బంది కలుగుతున్నదని తెలుసుకున్నాడు. అంతేకాక, చదువుకున్న తనకు సంస్కారం లేదని పరోక్షంగా వంటవాడు ఆరోపిస్తున్నట్లు గ్రహించాడు.

మరుసటి రోజునుంచి ఆలస్యం లేకుండా రాత్రిళ్ళు ఇంటికి చేరి తల్లిని ఆనందపెట్టసాగాడు. వంటవాడిక్కూడా ఇది మేలు చేకూర్చింది.

–ఎస్.వి.ఆర్. సత్యనారాయణమూర్తి



బేతాళ కథలు

# మౌన యోగి!

పట్టువదలని విక్రమార్కుడు చెట్టు వద్దకు తిరిగివెళ్ళి, చెట్టుపైనుంచి శవాన్ని దించి భుజాన వేసుకుని, ఎప్పటిలాగే మౌనంగా శ్మశానంకేసి నడవసాగాడు. అప్పుడు శవంలోని బేతాళుడు, "రాజా, ఈ అర్ధరాత్రివేళ, భయంగొలిపే ఈ శ్మశానంలో ఏ కార్యార్థివై ఇన్ని ఇక్కట్లకు ఓర్చి శ్రమిస్తున్నావో తెలియదు. కానీ, నువ్వు మహాత్ముడు, మహాయోగి అని ఎవరినైనా నమ్మి వాళ్ళకోసం ఇన్ని బాధలకు లోనవుతుంటే మాత్రం తగు హెచ్చరికలో వుండడం అవసరం. ఎందుకంటే, అలాంటివాళ్ళల్లో చాలామంది రాజాశ్రయంలో సుఖభోగాలు అనుభవించవచ్చునన్న తాపత్రయంలో ఉంటారు. ఇందుకు ఉదాహరణగా, మౌనయోగి–రాజు కనకసేనుడు అనేవాళ్ళ కథ



చెబుతాను, శ్రమ తెలియకుండా, విను,'' అంటూ ఇలా చెప్పసాగాడు:

మమతాపురి అనే నగరం శివార్లలోని కరుణానది తీరంలో ఒక పెద్ద మర్రిచెట్టు వుండేది. ఆ చెట్టుకింద ఒక యోగి ఉండేవాడు. అతణ్ణి చూసిన జనం మొదట అతడొక పిచ్చివాడు అనుకున్నారు. కానీ, అతడిలో ఎలాంటి మతిభ్రమణ లక్షణాలూ కనిపించలేదు. అతడివల్ల ఎవరికీ ఎన్నడూ ఎటువంటి కష్టమూ కలగలేదు. అందువల్ల అతడు ఎవరో యోగి అయివుంటాడని భావించారు.

ఆ యోగి దగ్గరకు ఎవరు వెళ్ళి ఏమి అడిగినా మాట్లాడేవాడు కాదు. వాళ్ళు ఏమైనా కాయలూ, పండ్లూ తెచ్చిపెడితే మాత్రం తినేవాడు. కొందరు అతణ్ణి చెవిటి, మూగయోగి అనికూడా పిలిచేవారు.

ఒక రోజున ఆ ప్రాంతంలోని ఆబోతు ఒకటి చెలరేగి, కనిపించినవారిని తన కొమ్ములతో కుమ్మి పొడుస్తూ నానా రభస చేయసాగింది. జనం దాన్నిపట్టి బంధించాలని వెంటబడ్డారు. అది రంకెలు వేస్తూ చెవిటి-మూగయోగి కూర్చునివున్న మర్రిచెట్టుకేసి వచ్చింది. జనం కంగారుగా, ''యోగీ, లేచి పారిపో! లేకపోతే ఆబోతు వచ్చి మీద పడుతుంది,'' అని అరవసాగారు.

కాని, యోగిలో చలనం లేదు. ఆబోతు అలసిపోయి నోటివెంట నురుగులు కక్కుతూ యోగి దాపులకు వచ్చి ఒకటిరెండు క్షణాలు నిలబడి, చప్పున అతడి ముందు పడుకుని సేద తీరసాగింది.

ఆబోతు ఇలా ప్రవర్తించడంలో యోగి ప్రమేయం ఏమీలేదు. అలా జరగడం పూర్తిగా కాకతాళీయం. అయితే, ఈ జరిగినదానికి అక్కడ గుమిగూడిన జనం రకరకాలుగా అర్థాలు చెప్పుకున్నారు.

''ఈ యోగి చెవిటీ-మూగేకాదు; చూపు కూడా లేనివాడు. అలాకాకపోతే, ఆబోతు మీదికివస్తున్నా ఎందుకు పారిపోడు!''అన్నారు జనంలో కొందరు.

''అలా అనడం మహాపచారం. ఈయన ఒక మహాయోగి. అందువల్లనే అంతగా రెచ్చిపోయిన ఆబోతు, ఆయన ముందు సాధువుగా మారిపోయింది. ఈయన దగ్గర అద్భుతశక్తులున్నాయి. ఈ మహాయోగి ఇక్కడ వుండడం మన నగరానికి ఎంతో మేలు!'' అంటూ కొందరు ప్రచారం ప్రారంభించారు.

ఆరోజు నుంచి యోగి దగ్గరకు వచ్చే జనం పెరిగిపోయారు. అలా వచ్చినవాళ్ళు తమకు తోచిన కానుకలు-కాయో, ఫలమో, తమ పొలంలో పండిన పంటో భక్తితో తెచ్చి ఇచ్చేవారు. ఆ కానుకలను యోగి తనదగ్గరకు వచ్చే ఇతర భక్తులకు ఇచ్చేవాడు. అందరూ

యోగి త్యాగగుణాన్ని గొప్పగా పొగుడుతూ చెప్పుకునేవారు.

కొందరు యోగికి తమకెదురైన సమస్యల గురించి చెప్పి, ఆయన సలహా అడిగేవారు. యోగి ఏమీ మాట్లాడేవాడు కాదు. తమ సమస్యలకు పరిష్కారం అడిగినవాళ్ళే ఏదో తమకు తోచినది చెప్పి, ''ఇలా చెయ్యమంటారా, స్వామీ? ఇలా చేస్తే మాకు మంచి జరుగుతుంది కదా!'' అని అడిగేవారు.

యోగి వాళ్ళ మాటలు వినీవిననట్టు వుండేవాడు. ఏదో ఒకదానికి సరేనన్నట్టు సంకేతంగా తల ఊపేవాడు. కొన్నింటికి కాదన్నట్టు తల అడ్డంగా ఊపేవాడు. ఇప్పుడు యోగిని, జనం సంకేతయోగి అని కూడా పిలవసాగారు.

క్రమంగా, యోగి గురించి మమతాపురి నగరంలోనే కాక చుట్టుపక్కల గ్రామాల్లో కూడా విపరీతమైన ప్రచారం జరిగింది. దాంతో ఆయన దగ్గరకు వచ్చే భక్తుల సంఖ్య పెరగడంతో పాటు, వాళ్ళు ఇచ్చే కానుకల విలువ కూడా పెరిగింది. ఆ ప్రాంతంలో లౌక్యం తెలిసిన కొందరు వంచకులు, యోగి వున్న మర్రిచెట్టు చుట్టూ ఒక దడి కట్టి, ఆయనను దర్శించడానికి వచ్చినవాళ్ళ దగ్గర డబ్బు వసూలుచేయడం ప్రారంభించారు. తాము యోగిబాబా అనుమతితోనే అక్కడ ఒక ఆశ్రమం కట్టేందుకు చందాలు వసూలు చేస్తున్నామని అనేవారు. కానీ ఆ ధనాన్ని వాళ్ళే తలాకాస్త పంచుకుని తినేసేవాళ్ళు. అంతేకాక యోగికి తిండిపెట్టే విషయంలో కూడా ఆ వంచకులు లాభాలు చేసుకోవడం ప్రారంభించారు. యోగికి రాత్రివేళ తినేందుకు ఒకటి రెండు ఎండు రొట్టెలు మాత్రమే ఆహారంగా పెట్టేవారు. అయినా యోగి ఎన్నడూ ఎవర్నీ



ఏమీ అనేవాడు కాదు. ఎప్పటిలాగే రోజులు గడుస్తున్నాయి.

ఇలా వుండగా, ఒకసారి ఆ యోగి గురించి ఆ దేశం రాజు కనకసేనుడికి తెలిసింది. చెవిటి, మూగ, కంటి చూపుకూడా లేని ఆ యోగి, జనానికి మౌనంగా తల ఊపుతూ మేలు కలిగేలా సేవచేయడం గురించి విన్నాక, రాజుకు యోగిని చూడాలనిపించింది. ఒక నాటిరాత్రి భక్తులందరూ వెళ్ళిపోయిన తర్వాత, రాజు మారువేషంలో యోగి దగ్గరకు వచ్చాడు.

యోగి ముందున్న ఆకులో రెండు ఎండు రొట్టెలు వున్నాయి. కాస్త దూరంలో ఒక కాగడా మాత్రం వెలుగుతున్నది. యోగి కళ్ళలో నీళ్ళు సుళ్ళు తిరుగుతూ వున్నాయి. ఆయన గత జీవితంలో ఏదో ఒక విషాద కథ వుండ వచ్చని రాజుకు అనిపించింది.

''స్వామీ! నేను ఈ దేశం రాజును. మీరు జనానికి గుడ్డి, మూగ, చెవిటి యోగి కావచ్చు.



కానీ మిమ్ములను సరిగా అర్థం చేసుకోలేక, మీకు ఈ పేర్లు పెట్టినవాళ్ళే ఒక రకంగా వికలాంగులు. ఇన్నేళ్ళతర్వాత ఇప్పుడు మీరు మాట్లాడవలసిన తరుణం వచ్చిందని, నాకు తోస్తున్నది. దయచేసి, నాకు మీ గురించి చెప్పండి!" అని రాజు కనకసేనుడు, యోగిని వేడుకున్నాడు.

"మహారాజా, మీ మాటలు విన్నాక ఇక ఈ మౌనవ్రతం చాలించాలని నిర్ణయించుకున్నాను. మీరు చెప్పకముందే మీరెవరో గొప్పవ్యక్తి అని నేను గ్రహించాను. నిజం ఎన్నడూ నిజంగానే ఉంటుంది. దాని మహాశక్తిముందు ఎలాంటి మౌనం లేదా అబద్ధం నిజం ముసుగువేసుకు నిలవలేదు!" అని యోగి ఒక్క క్షణం మౌనం వహించాడు.

మాట్లాడడం ప్రారంభిస్తూనే తన వ్యక్తిత్వాన్ని ప్రదర్శించిన యోగిమీద మహారాజుకు అపారమైన ఆదరభావం కలిగింది.

యోగి ఇలా చెప్పడం ప్రారంభించాడు:

"మహారాజా! నిజమైన చక్షువులు మన మనోనేత్రాలే కదా! ఈ బాహ్యనేత్రాలు చూసేవన్నీ నిజాలుకావుకదా? నిజాలని నమ్మించడానికి, అబద్ధాలను నిజాలుగా చూపితే, అవి అబద్ధాలని గుర్తించడానికి, మనకు ఈ మనోనేత్రాలే కదా శరణం. అందుకే నిజాన్ని చూడలేని ఈ కళ్ళతో చూడడం ఎందుకని నిర్ణయించుకున్నాను. అప్పటి నుంచీ నేను, ఈ కళ్ళతో చూడడం మానేశాను. ఆనాటి నుంచీ ఈ కళ్ళతో నేను చూసేది ఏదీ నామనసును తాకదు. తాకినా దానిని నా మనసు స్వీకరించదు. అలా బాహ్యనేత్రాల దృష్ట్యా నేనొక గుడ్డివాడినయ్యాను!" అని ఆగాడు.

"మహాత్మా! జనం మిమ్మల్ని గుడ్డివారనే కాదు, మూగ, చెవిటి అనికూడా అనుకుంటున్నారు. మీరిలా ప్రవర్తించడానికి ఏదైనా బలమైనకారణం వున్నదా?" అని అడిగాడు రాజు.

"ఉన్నది, మహారాజా, వినండి! నా భార్యకు ఒకే ఒక్క తమ్ముడు. వాడంటే ఆమెకు ఎక్కడలేని ప్రేమా, ఆదరణా. వాడు చేస్తున్న వ్యాపారంలో బాగా నష్టపోయి అప్పులవాళ్ళ బాధలో వుండగా, నా భార్య కళ్ళనీళ్ళ పర్యంతమై కోరినమీదట, నాకున్న ఐదెకరాల పొలంలో మూడెకరాలు గ్రామంలో వున్న వడ్డీవ్యాపారికి తాకట్టుపెట్టి, వాడికి డబ్బు సర్దాను. నగరంలో లాభసాటిగా వ్యాపారం చేస్తున్న తన మిత్రుడితో కలిసి వ్యాపారం చేసి, సంవత్సరం లోపల నా డబ్బు తిరిగి ఇచ్చి తాకట్టు విడిపిస్తానని మాట ఇచ్చాడు. కానీ సంవత్సరం గడిచినా వాడినుంచి డబ్బు రాకపోగా, మనిషి ఏమయ్యాడో కూడా తెలియలేదు. ఈలోపల వడ్డీ వ్యాపారి నుంచి వత్తిడి ఎక్కువైంది. ఇది పనికాదని, నేను దూర గ్రామంలో వున్న బంధు

వొకాయన దగ్గరకు డబ్బుకోసం వెళ్ళాను, ఫలితం కలగలేదు. నేను వారం రోజుల తర్వాత మా గ్రామానికి తిరిగి వస్తుండగా, గ్రామ రచ్చబండ దగ్గర కూర్చుని వున్న వడ్డీ వ్యాపారీ, గ్రామాధికారీ మరిద్దరు పెద్దలు— నేను బాకీ వడ్డీతోసహా పక్షం రోజుల్లో తీర్చక పోతే పొలంతో పాటు ఇల్లుకూడా వదులుకో వలసి వస్తుందని గట్టిగా హెచ్చరించారు.

''మహారాజా! కుటుంబ గౌరవం, ప్రతిష్ఠ అనేవి రాజుకైనా, సామాన్య గృహస్థుకైనా ప్రాణప్రదమైనవి. నేను గడప దాటి ఇంటిలో అడుగుపెట్టగానే, నా భార్య నవ్వుతూ ఎదురు పడి ఏదో చెప్పబోయింది. అయితే రచ్చబండ దగ్గర జరిగిన అవమానంతో మితిమీరిన కోపంలో ఉన్న నేను, ఆమెనూ, ఆమె తమ్ముణ్ణీ— మొత్తం వాళ్ళ వంశాన్నీ నానా దుర్భాషలాడడం ప్రారంభించాను. అంతే! ఆమె పెద్దగా శోకం పెడుతూ పెరటిలోకి పరిగెత్తింది. నేనేం పట్టించుకోలేదు. ఆ తర్వాత కొంతసేపటికి పక్కగదిలోకి వెళ్ళగా, వారం రోజుల్లో డబ్బుతో తాను వస్తున్నట్టు, ఆమె తమ్ముడు రాసిన ఉత్తరం కనిపించింది,'' అని యోగి కళ్ళ నీళ్ళు తుడుచుకుంటూ ఆగాడు.

''తమ భార్య పెరట్లోవున్న బావిలో దూకి ఆత్మహత్యచేసుకున్నది! అంతేగదా, మహాత్మా?'' అన్నాడు రాజు.

''జరిగిందదే, మహారాజా! నేను ఇంటి తలుపులు కూడా మూయకుండా, అప్పటి కప్పుడు బయల్దేరి దేశదిమ్మరినై కొన్నాళ్ళకు నదీతీరంలోని ఈ మర్రిచెట్టుకిందికి చేరాను. ఆ క్షణం నుంచీ నేను అంధుణ్ణీ, మూగ, చెవిటి వాణ్ణీ,'' అన్నాడు.

''మరి మీ గురించి ప్రచారంలో వున్న అద్భుతశక్తులమాటేమిటి, మహాత్మా!'' అని ప్రశ్నించాడు రాజు.

''నాలో ఏవో అద్భుతశక్తులున్నవని పని గట్టుకు ప్రచారం చేస్తూ, లాభపడుతున్న వంచకుల గురించి నాకు సర్వం తెలుసు.



రాత్రింబవళ్ళు నన్ను కలవరపరుస్తున్న సమస్య అదొక్కటే. కానీ, నేను నిస్సహాయుణ్ణి!" అన్నాడు యోగి.

మరుసటి రోజు మౌనయోగిని దర్శించుకుందామని వచ్చిన భక్తులకు పెద్ద నిరాశ ఎదురయింది. అక్కడ ఆయన లేడు. ఆ తర్వాత కూడా ఆయన ఎవరికీ కనిపించ లేదు. మహారాజు అంతరంగిక సలహాదారులలో కొత్తగా చేరిన వయోవృద్ధుడే, ఆ మౌన యోగి అని కనకసేన మహారాజు ఒక్కడికి మాత్రమే తెలుసు.

బేతాళుడు ఈ కథ చెప్పి, "రాజా, ఇన్నేళ్ళుగా గుడ్డి, చెవిటి, మూగగా కాలం గడిపిన యోగి, రాజును చూసి ఎందుకు కన్నీళ్ళు పెట్టుకున్నాడు? తాను యోగిగా వుంటూ ప్రజలకు చేసే సేవకంటే, రాజుకు అంతరంగిక సలహాదారుగా వుండడం గొప్ప ప్రజాసేవ ఎలా అవుతుంది? యోగిగా జీవించడం పట్ల కలిగిన విసుగుతో, రాజు దగ్గర లభ్యమయ్యే సుఖభోగాల పట్ల కాంక్ష కలిగి, అతడు రాజాశ్రయాన్ని కోరినట్టు స్పష్టంగా అర్థమవుతున్నదిగదా? ఈ సందేహాలకు సమాధానం తెలిసికూడా చెప్పకపోయావో, నీ తల పగిలిపోతుంది," అన్నాడు.

దానికి విక్రమార్కుడు, "రాజు కనకసేనుడు తనను అడిగిన ప్రశ్నలు వింటూనే, యోగికి ఆయన విజ్ఞానవంతుడనీ, జిజ్ఞాసువు అనీ అర్థమైంది. తాను స్వయంగా తనకు ఆపాదించుకున్న మూగ, గుడ్డి, చెవిటితనంతో, తానొక చెడుకు సాధనం కారాదని ఆయన నిర్ణయించుకున్నాడు. తన పంచన చేరి, తన మౌనవ్రతాన్ని స్వలాభానికి ఉపయోగించుకుంటున్న వంచకుల మోసం చూడలేక ఆయన కళ్ళనీళ్ళు పెట్టుకున్నాడు. అదిచూసి రాజు, యోగికి మనశ్శాంతి అవసరమని గుర్తించాడు. వంచకులను పట్టి బంధించవచ్చు. కానీ, సమస్యకు అది పూర్తి పరిష్కారం కాదు. ఎందుకంటే, మరొక తరహా వంచకులు యోగిచుట్టూ చేరే ప్రమాదమున్నది. అందుకే, రాజాయనను ఎవరికీ తెలియకుండా తీసుకుపోయి, తన సలహాదారుగా గౌరవించాడు. ఈ జరిగినదానిలో, యోగి, రాజు దగ్గర లభ్యమయ్యే సుఖభోగాలకు ప్రలోభపడడం అన్న ప్రసక్తే లేదు," అన్నాడు.

రాజుకు ఈవిధంగా మౌనభంగం కలగగానే, బేతాళుడు శవంతోసహా మాయమై, తిరిగి చెట్టెక్కాడు. – (కల్పితం)

[ఆధారం: సుంకర భాస్కరరావు రచన]



# ఆపదల్లో ఆదుకున్న మునివర్యుడు!



ఒకానొకప్పుడు వృత్రాసురుడనే బలవంతుడైన రాక్షసరాజు, ముల్లోకాలను తన పాదాక్రాంతం చేసుకోవాలన్న అత్యాశతో విజృంభించాడు. దేవతల రాజు ఇంద్రుడు, వృత్రాసురుడితో సుదీర్ఘకాలం యుద్ధం సాగించి, చివరకు హతమార్చాడుగాని, దేవతలకు మాత్రం శాంతి సమకూరలేదు. కారణం కాలకేయులు!

వృత్రాసురుడి అనుచరులైన ఈ కాలకేయులు దేవతలనూ, మానవులనూ హింసించసాగారు. తమ నాయకుడైన వృత్రాసురుడు మరణించగానే కాలకేయులు ఎక్కడికో పారిపోయారు. కొన్నాళ్ళవరకు వాళ్ళు, ఎక్కడున్నారు? ఏమయ్యారు? అని ఎవరూ తెలుసుకోలేకపోయారు. ప్రాణభీతితో ఏ అరణ్యమధ్యానికో పారిపోయి వుంటారని అనుకున్నారు. అయితే, అది నిజం కాదు. ఒకనాటి అర్ధరాత్రి అందరూ నిద్రపోతూన్న సమయంలో, కాలకేయులు హఠాత్తుగా ఒక ఊరి మీద పడి ఇళ్ళను తగులబెట్టి, మనుషులను హింసించి చంపి, నానా బీభత్సం సృష్టించి వెళ్ళిపోయారు.

ఆ తరవాత కూడా తరచూ, సాధువుల మీదికీ, సజ్జనుల మీదికీ మెరుపు దాడులు జరిపి హింసించేవాళ్ళు.

కాలకేయుల దురాగతాలను అరికట్టడానికి ఎందరో రాజులు, వీరులు ఎంతగానో ప్రయత్నించారు. అయితే కాలకేయులున్న చోటును వాళ్ళు కనుగొనలేకపోయారు. వాళ్ళు హఠాత్తుగా వచ్చి పడేవాళ్ళు. ఏం

బిందుసార్



జరుగుతున్నదో తెలుసుకునేలోగానే ఇళ్ళు తగల బడిపోయేవి. తలలు ఎగిరిపోయేవి. కాళ్ళు చేతులు తెగి పడేవి. శరీరాలు రక్తసిక్త మయ్యేవి. ప్రజలు ప్రాణాలు గుప్పిట పట్టు కుని దిక్కుకొకరు చెట్టుకొకరుగా పారిపోయి నప్పటికీ, ఒక్కరిద్దరు మాత్రమే ప్రాణాలతో తప్పించుకోగలిగేవారు.

తెల్లవారేసరికి రాక్షసమూక జాడ కనిపిం చేదికాదు. వాళ్ళు ఎక్కడికి వెళ్ళారో కూడా తెలిసేది కాదు. సైనికులు ఎంత వెదికినా ప్రయోజనం లేకుండాపోయేది. వాళ్ళు ఎలా మాయమైపోతున్నారా అని అందరూ ఆశ్చర్యంతో, తీరని భయాందోళనలకు లోన య్యేవారు.

కొన్నాళ్ళకు ఈ రాక్షసుల గుట్టు బయట పడింది. భూమి మీద నానారభస చేసి, వాళ్ళు సముద్రగర్భం చేరి గుట్టుచప్పుడు కాకుండా దాక్కునేవాళ్ళు. ఆ సంగతి తెలిసినా సముద్రం లోపలికి వెళ్ళి వాళ్ళను ఎదుర్కొని చంపేశక్తి ఎవరికీ లేకపోయింది.

ఈ ఆపద సమయంలో ఆదుకునే శక్తి ఒక్క అగస్త్యమునికే ఉన్నదని దేవతలకు తెలియవచ్చింది. ఆయన హిమాలయ పరి సరాల నుంచి వింధ్యపర్వతాలు దాటుకుని దక్షిణాగ్రానికి చేరాడు. ఆయన దక్షిణ దిశకు చేరడానికి ప్రత్యేక కారణం ఉంది. వింధ్యపర్వ తానికి ఎందుకో సూర్యుడి మీద ఆగ్రహం కలిగింది. తూర్పునుంచి పశ్చిమదిశగా సాగే సూర్య గమనాన్ని ఆపాలని వింధ్యపర్వతం భావించింది. రోజు రోజుకూ అమిత వేగంతో ఆకాశాన్నంటేలా ఎదగసాగింది. దేవతలూ, మునులూ అలా చేయవద్దని వింధ్యపర్వ తాన్ని వేడుకున్నారు. అయినా, వింధ్యపర్వతం వినిపించుకోలేదు.

వింధ్యపర్వతానికి తన గురువైన అగస్త్యు డంటే ఎనలేని గౌరవమర్యాదలు ఉండేవి. అది ఎరిగిన దేవతలు, సూర్యచంద్రుల గమనానికి అవరోధం కల్పించాలన్న వింధ్య పర్వతాన్ని అదుపుచేయమని అగస్త్యుణ్ణి అభ్యర్థించారు.

అగస్త్యుడు బాగా ఆలోచించాడు. తిన్నగా పర్వతం దగ్గరికి వెళ్ళాడు. వింధ్యపర్వతం ఆకాశాన్నంటుతున్న తన ఆకారాన్ని తగ్గిం చుకుని, వంగి మునికి వినయంతో శిరసు వంచి నమస్కరించింది.

అగస్త్యుడు ఆశీర్వదించి, "నేను తిరిగి వచ్చేవరకు ఇలాగే ఉండు," అని చెప్పి దక్షిణాపథంకేసి నడిచాడు.

గురువు మాటను జవదాటే ప్రసక్తేలేదు గాని, గురువు ఆ తరవాత తిరిగి వెళ్ళనేలేదు.

అగస్త్యుడు దక్షిణప్రాంతాన్నే తన నివాసంగా చేసుకున్నాడు. ఆ విధంగా వింధ్యపర్వతం ఆ తరవాత వంచిన తల ఎత్తలేదు; పైకి ఎదగ లేదు. ఎలాంటి అవరోధం లేకుండా యథా ప్రకారం సూర్య చంద్రుల గమనం కొనసాగు తున్నది!

ఇప్పుడు దేవతలు మళ్ళీ అగస్త్యుణ్ణి ఆశ్రయించి, "కాలకేయుల దురాగతాలను భరించలేకుండా ఉన్నాం. సాధువులకూ సజ్జ నులకూ భద్రత కరువయింది. ప్రజలకు శాంతి లేకుండా పోయింది. ఆ దుర్మార్గుల నుంచి మమ్మల్ని రక్షించండి!" అని వేడు కున్నారు.

అగస్త్యుడు తల పంకించి, తిన్నగా సము ద్రతీరానికి నడవసాగాడు. దేవతలు, రాజులు, వీరులు ఆయన్ను అనుసరించి వెళ్ళారు. సముద్రతీరం చేరగానే అగస్త్యుడు కొంతసేపు మౌనంగా అలాగే స్థాణువులా నిలబడ్డాడు. ఏం చేయనున్నాడో అని అందరూ ఉత్కంఠ తతో ఎదురు చూడసాగారు.

ఆయన ఏకాగ్రతతో ఆలోచించాడు. ఆ తరవాత నెమ్మదిగా కూర్చుని చేతులు సాచి దోసిలి పట్టాడు. సముద్రం నుంచి జలం పాయలా ఆయన దోసిలిలోకి ఉరికింది. ముని దోసిలితో జలాన్ని తాగసాగాడు. కొంత సేపటికి సముద్ర జలాన్నంతా తాగేశాడు. లోపల దాక్కున్న కాలకేయులు హాహాకారా లతో బయటపడ్డారు. ముని వెంట వచ్చిన దేవతలు, రాజులు, సైనికులు వాళ్ళను హతమార్చారు!

ఇక్కడొక ముఖ్యమైన సంగతి చెప్పాలి. మన పురాణ కథలలో ఎన్నో అంతరార్థాలు ఉంటాయని వాటిని చదివినవారందరికీ తెలుసు. ఇక్కడ సముద్రం, చైతన్యానికి సంకేతం. ముని సముద్ర జలాన్నంతా తాగేసి, రాక్షస సంహారానికి సాయపడడాన్ని- చైతన్యాన్ని అదుపులోకి తెచ్చుకుని, దాని అభ్యున్నతికి అవరోధంగా ఉన్నవాటిని తొల గించడం అని చెప్పుకోవచ్చు! ప్రస్తుతానికి కథ మీకు తెలుసు. మునుముందు ఇలాంటి కథలపట్ల మీకు మరింత ఆసక్తి కలిగినట్ట యితే, మరిన్ని కథలు చదివి, ఆలోచించి వాటిలో దాగివున్న అర్థాలను, సత్యాలను గ్రహించవచ్చు.



# మనదేశం గురించి తెలుసుకుందాం

క్విజ్

భూగోళానికి సంబంధించిన ప్రశ్నలు ఈనెల క్విజ్‌లో ఉన్నాయి. వాటిలో ఎన్నిటికి సరైన సమాధానాలు చెప్పగలరో ప్రయత్నించి చూడండి.

1. ఈశాన్య భారతదేశంలో 'సర్పాల భూమి' అని అర్థంవచ్చేలా ఒక కొండప్రాంతం ఉంది. దాని పేరేమిటి?
2. 'శ్రీరంగపట్నం' ద్వీపం ఏ నదీమధ్యంలో నెలకొనిఉంది?
3. ఒరిస్సాలోని ఒక నదీ ముఖంలో మొనదేలిన తాడిచెట్లు విరివిగా ఉన్నాయి. ఆ నది ఏదో తెలుసా?
4. భూమిమీద ఎక్కువ జలమార్గాలు ఉన్న రాష్ట్రం ఏదో తెలుసా?
5. ప్రపంచంలోకెల్లా ఎత్తయిన గ్రామంగా స్పితీ లోయలో ప్రసిద్ధిగాంచిన గ్రామం పేరేమిటి? అది ఎంత ఎత్తులో ఉంది?
6. కేరళ రాష్ట్రంలోని ఏ సరస్సులోకి పంబ, పెరియార్, మరిమల నదులు సంగమిస్తాయి?
7. పడమటి కనుమలలో అతి ఎత్తయిన వేసవి విడిదిగా పేరుగాంచిన మహారాష్ట్రలోని పట్టణం ఏది?
8. మనదేశంలోకెల్లా అతి పెద్దదైన జోగ్ జలపాతం ఏ నదీమధ్యంలో ఉంది?
9. బుందీ కోటలోని ఒక కృత్రిమ తటాకంలో సగం మునిగిపోయిన స్థితిలో వరుణ భగవానుడి ఆలయం ఉంది. ఆ తటాకం పేరేమిటి?
10. మధ్యప్రదేశ్‌లోని ఒక రాజపుత్రవంశానికి వింధ్యపర్వతాల పేరు ఉంది. ఆ వంశం పేరేమిటి?

(సమాధానాలు వచ్చే సంచికలో)

## మే క్విజ్ సమాధానాలు

1. బహమనీ, సుల్తాన్ అల్లా ఉద్దీన్, 1347.
2. అండమాన్, నికోబార్ దీవులమధ్య పది డిగ్రీల కాలువ.
3. కటక్.
4. బొంబాయి (ముంబై).
5. ఢిల్లీ.
6. కలకత్తా (కొల్‌కత).
7. మదురై (వైగై నది).
8. పాంబన్ జలసంధి.



# కాగడాపిశాచం

కనకయ్య కుటుంబం ఉంటున్న రావుల పాలెం, అడవిప్రాంతాల్లో వున్న గ్రామాల్లో ఒకటి. అక్కడికి కొంచెం దూరంలో వున్న ఒక చిన్న పట్నంలో అతడికి కొబ్బరికాయల వ్యాపారం వున్నది.

ఒకరోజు కనకయ్య కొట్టు మూసేసరికి బాగా పొద్దుపోయింది. చిన్న వర్షం కూడా ప్రారంభమైంది. రోజూ వెళ్ళి వస్తున్న అడవి దారే గనక, త్వరత్వరగా నడిచి ఇల్లు చేర వచ్చనుకుంటూ, అతడు బయలుదేరాడు. అయితే, క్రమంగా వర్షం పెద్దదై ఉరుములూ, మెరుపులూ మొదలయ్యాయి. కనకయ్య పరుగుపరుగున పోయి దారికి కాస్త దూరంలో వున్న పాతకాలంనాటి పాడుబడిన శివాలయం లోకి వెళ్ళాడు.

ఆ సమయంలో అక్కడ కొన్ని పాములు బుసలుకొడుతూ తిరుగుతున్నవి. రెచ్చిపో యిన ఏ పాముచేతనో కాటువేయించుకోవ డంకంటే, వర్షంలో తడుస్తూనే ఇల్లు చేరడం మేలనుకుంటూ కనకయ్య అక్కడినుంచి అడవిదారి పట్టాడు.

అడవి అంతా చిమ్మచీకటిగా వున్నది. ఒకచోట చెట్ల చాటునుంచి పెద్ద వెలుగు అతడి కంటబడింది. కనకయ్య అటుకేసి నడిచాడు. అక్కడ ఒక బండరాయి మీద రెండు చేతుల్లో భగభగమండుతున్న కాగడా లతో, ఒక ముసలి పిశాచం నిలబడి వున్నది.

పిశాచాన్ని చూసి భయపడిన కనకయ్య వెనుదిరగబోయేంతలో, పిశాచం పెద్దగా, "భయపడకు, రారా! దారి తప్పలేదుగదా? రామాపురం వెళ్ళాలంటే, ఇటు కుడివైపుకు; రావులపాలెం వెళ్ళాలంటే అటు ఎడమ వైపుకు," అంటూ కాగడాను అటూ ఇటూ తిప్పుతూ దారులు చూపింది.

పిశాచం సౌమ్యంగా మాట్లాడుతూండ టంతో ధైర్యం తెచ్చుకున్న కనకయ్య, "ఇంత అర్ధరాత్రి వేళ అడవిలో భోరున కురుస్తున్న వర్షంలో, ఒంటరిగా కాగడా తిప్పుతూ నిలబడ

మాచిరాజు కామేశ్వరరావు



వలసిన అవసరం నీకేం కలిగింది?'' అని అడిగాడు.

దానికిపిశాచం పెద్దగా నిట్టూర్చి, ''నా అవసరం పుణ్యం! బతికున్న రోజుల్లో అన్నీ వుండీ, ఆపదల్లో వున్నవారికి చిన్నమెత్తు సాయం చేయకుండా మహాస్వార్థంగా బతికాను. దాని ఫలితమే, ఈ పిశాచరూపం. ఇప్పుడయినా నలుగురికీ మేలుచేసి, ఏపుణ్యలోకానికయినా పోవాలనుకుంటున్నాను,'' అన్నది.

ఈ పిశాచం ఏదో మహాసత్తెకాలపుదనుకుంటూ, కనకయ్య, ''అడవిలో వుంటూ చీకటిలో నలుగురికీ దారిచూపిస్తే ఏమాత్రం పుణ్యంవస్తుంది? బతకడానికి దారి చూపించు. మా ఇంట్లో కనకవర్షం కురిపిస్తే, నీకెంత పుణ్యం!'' అన్నాడు ఆశగా.

దానికి పిశాచం కొద్దిసేపు తీవ్రమైన ఆలోచనలోపడి, ''సరే! అయితే,స్వార్థంతో కోరుకున్న కోర్కెలు నేనుతీర్చను.మరొకటికోరుకో,'' అన్నది.

ఆ జవాబుకు కనకయ్య కోపంతో రుసరుసలాడుతూ, ''అయితే, మా పొరుగింటి పుల్లయ్య తిండికి గతిలేక అల్లాడిపోతున్నాడు. వాడికి కుంచెడు బంగారం ఇస్తావా?'' అన్నాడు కాస్త వేళాకోళంగా.

అది గ్రహించిన పిశాచం, ''కుండపోతగా కురుస్తున్న ఇంత పెద్దవర్షంలో, నా చేతిలోని కాగడా ఆరిపోకుండా వెలుగుతున్నదంటే, నాలో ఇతర్లు కోరే కోర్కెలు తీర్చగల శక్తి వున్నదని, నువ్వు గ్రహించినట్టులేదు. సరే! ఆ పుల్లయ్యను పెరట్లో వున్న కొబ్బరిచెట్టు కింద తవ్వి చూడమను. లంకెలబిందెలు దొరుకుతాయి. అయితే, ప్రాప్తంలేనివాళ్ళు తవ్వితే పాములూ, తేళ్ళూ మాత్రం కనిపిస్తాయి,'' అన్నది.

కనకయ్య అక్కడి నుంచి ఇల్లుచేరి, జరిగింది భార్యకు చెప్పి, ''మొత్తానికి పుల్లయ్య అదృష్టవంతుడు,'' అన్నాడు.

ఆ మాటలకు దుర్గమ్మ మూతి మూడు వంకర్లు తిప్పి, ''తగుదునమ్మా అని పరిగెత్తిపోయి పుల్లయ్యకు లంకెలబిందెల రహస్యం చెప్పేవుకనక! ఇప్పుడే పుల్లయ్యను అడవిలోకి వెళ్ళమను. కాగడా పిశాచాన్నిమనఇంట్లోసిరులు కురిపించమని అడగమను. అతడు మనకు సంపద దొరికేచోటు చెప్పాక, అతడికి మనం లంకెల బిందెల సంగతి చెబుదాం,'' అన్నది.

కనకయ్య, భార్య చెప్పమన్నట్టుగానే పుల్లయ్యకు చెప్పాడు. పుల్లయ్య హుటాహుటిని పోయి, కాగడా పిశాచంతో మాట్లాడి తిరిగి వచ్చి, కనకయ్యతో, ''మీ వంటింటి గోడ

బద్దలుకొడితే, పెద్ద ముంతెడు బంగారు కాసులు దొరుకుతవట!'' అని చెప్పాడు.

''అలాగా, సరిసరి! మీ పెరటి కొబ్బరి చెట్టుకింద తవ్వి లంకెల బిందెలు తీసుకో,'' అన్నాడు కనకయ్య, పుల్లయ్యతో.

తర్వాత కనకయ్య, దుర్గమ్మ కలిసి, ఒకవైపు వంటింటి గోడ పడగొట్టారు. కాసుల ముంత కనిపించలేదుగానీ, పాతకాలపు పెంకుటిల్లు కావడంతో ఒక పక్కకు ఒరిగిపోయింది. గోడ ల్లోంచి తేళ్ళూ, పాములూ బయటికొచ్చాయి.

అప్పటికప్పుడే కనకయ్య, కాగడా పిశాచాన్ని నిలదీసి ఎడాపెడా చీవాట్లు పెట్టేందుకు ఆవేశంగా అడవిలోకిపోయాడు. ఎక్కడా కాగడా పిశాచం జాడలేదు. పాడు బడిన శివాలయం అరుగుమీద పడుకునివున్న సాధువు, కనకయ్యను చూసి, ''ఓయి బిడ్డా! నువ్వెతుకుతున్నది కాగడాపిశాచం కోసమే గదా? పుణ్యం సంపాయించాలనుకుంటే, మానవమాత్రులు కంటబడని చోటుకు పోయి దైవస్మరణ చేసుకోమని, దాన్ని నేనే ఇక్కడి నుంచి పంపేశాను. ఇంతకూ, ఆ పిశాచంతో నీకేంఅవసరం పడింది,'' అని అడిగాడు.

కనకయ్య జరిగిందంతా చెప్పి, ''నన్ను ఆ కాగడాపిశాచం నిలువునా దగాచేసింది. నేను పుల్లయ్యకోసం లంకెలబిందెలు కోరాను, ఆ కోరిక నెరవేరింది. పుల్లయ్య, నా కోసం సంపద కోరాడు. ఆ కోరిక నెరవేరక పోగా పాములూ, తేళ్ళూ బయటి కొచ్చాయి. ఇంకా నాలుగైదు వానా కాలాలపాటు నిలిచుండే, నా పాత పెంకుటిల్లు కుప్పకూలింది!'' అన్నాడు.

సాధువు చిన్నగా నవ్వి, ''బిడ్డా! ఇందులో కాగడా పిశాచం చేసిన దగా ఏమీలేదు. స్వార్థం కొద్దీ కోరిన కోరికలు నెరవేరవని, అది ముందే హెచ్చరించింది. నువ్వు పుల్లయ్య కోసం ధనం కోరినప్పుడు, ఆ కోరికలో ఎటువంటి స్వార్థం లేదు. అందువల్లనే అది నెరవేరింది. పుల్లయ్య నీకోసం సంపద కోరాడు. అది నీ నుంచి తనకు దొరకబోయే సంపదను గురించిన సమాచారం కోసం. ఆ కారణంగానే, స్వార్థంతో కూడిన ఆ కోరిక నెరవేరలేదు. అర్థమైందిగదా?'' అని ప్రశ్నించాడు.

అర్థమైనట్టు కనకయ్య తలాడించి, తన కష్టార్జితమే తనకు ప్రాప్తం అని భావించి, తేలిక పడిన మనసుతో ఇంటిదారి పట్టాడు.



# హాస్యచతురులు: గోపాల్ భాండ్



కృష్ణానగర్‌లో మోనీబాబు అందరికన్నా ధనికుడు; పరమ పిసినారి. తలకు నూనె రాసుకుంటే ఖర్చయి పోతుందని చింపిరి జుట్టుతో తిరిగేవాడు. కట్టుకున్న బట్టలను కూడా వారానికి ఒకసారే ఉతికేవాడు. అతడంటే ఆ ఊళ్ళో ఎవరికీ ఇష్టం ఉండేది కాదు.

అవి పండుగ రోజులు. కొందరు పిల్లలు చందాకోసం మోనీబాబు దగ్గరికి వెళ్ళారు. "టపాకాయలు కాల్చడానికి మీకు డబ్బు కావాలా? డబ్బును అలా కాల్చి బూడిద చేయకండి. వెళ్ళండి!" అని కసిరి కొట్టాడు మోనీబాబు. పిల్లలు నిరుత్సాహంగా వెనుదిరిగారు.





దారిలో పిల్లలకు గోపాల్ భాండ్ ఎదురుపడ్డాడు. పిల్లలు అతనికి తమ అనుభవం వివరించి, " ఈ ఊళ్ళో అందరూ మాకు డబ్బిచ్చారు. అందరికన్నా ధనికుడై వుండీ ఒక్క మోనీబాబు మాత్రమే కనీసం యాభై రూపాయలు కూడా ఇవ్వలేదు," అంటూ వాపోయారు.

గోపాల్ భాండ్, "ఆయన పరమ పిసినారి అని మీకు తెలియదా?" అని కొంతసేపు ఆగి పిల్లలకు సాయపడాలని ఆలోచించి, "సరే, సాయంకాలం రండి. యాభైకాదు! వంద వసూలు చేద్దాం ఆయన నుంచి," అన్నాడు. పిల్లలు నవ్వుకుంటూ వెళ్ళిపోయారు.





మోనీబాబు తోటలో కూరగాయలు కోస్తున్నాడు. గోపాల్ భాండ్ తనకేసి రావడం చూడగానే, వాటిని చటుక్కున దాచేశాడు. "నేను ఉపవాసం చేస్తున్నాను. రాత్రికే తింటాను. నువ్వు కూరగాయలను రాత్రికి ఆదా చేయవచ్చు.. అదిసరే, నువ్వు వృధా చేస్తూన్న డబ్బు సంగతి ఎప్పుడైనా ఆలోచించావా?" అని అడిగాడు గోపాల్ భాండ్.



"నేనా? డబ్బు వృధా చేస్తున్నానా?" అంటూ మోనీబాబు ఆశ్చర్యంగా చూశాడు. "ఎవరైనా వస్తే దీపం ముట్టించి లోపలికి పిలుస్తావు. వాళ్ళు లోపలికి వచ్చి కూర్చున్నాక దీపం ఆర్పేస్తావు కదా?" అని అడిగాడు గోపాల్. "అవును. మాట్లాడుకునేప్పుడు ఒకరినొకరు చూసుకోవడం ఎందుకూ? మాటలు వినబడితే చాలదా?" అని అడిగాడు మోనీబాబు.. "అలాంటప్పుడు, చీకట్లో కూర్చున్నప్పుడు ఒంటిమీద బట్టలుమాత్రం ఎందుకు? దండగ!" అన్నాడు గోపాల్.



"ఒక కంటితో చూడగలవుకదా?" అని అడిగాడు గోపాల్. 'చూడగలను!" అని అన్నాడు మోనీబాబు. "మరి రెండు కళ్ళకూ జోళ్ళు పెట్టుకుని డబ్బు ఎందుకు వృధా చేస్తావు?" అన్నాడు గోపాల్. మోనీబాబు కళ్ళద్దాలు తీసి తుడుచు కుంటూ, 'గోపాల్ చాలా తెలివైనవాడే' అనుకున్నాడు.



"అసలు నీ ఉద్దేశం ఏమిటో చెప్పు?" అని అడిగాడు మోనీబాబు. "నువ్వు డబ్బు ఖర్చు పెట్టకుండా, దానిని వృధా చేస్తున్నావు అంతే! మన పిల్లల్ని హాయిగా పండుగ జరుపుకోనివ్వు!" అన్నాడు గోపాల్. మోనీబాబు ఒక్క క్షణం సిగ్గుతో తల దించుకుని, జేబులో నుంచి వంద రూపాయలు తీసి ఇచ్చాడు.



# కొండపల్లి బొమ్మలు



మునుముందు తిరుపతి-తిరుచానూరు వెళ్ళారంటే అక్కడ లభించే బొమ్మలను కొనడం మరిచిపోకండి. హస్త కళలకు మనదేశం ప్రసిద్ధి గాంచింది. అందులోనూ ఆంధ్ర రాష్ట్రానికీ, ముఖ్యంగా కొండపల్లి బొమ్మలకు ప్రత్యేక స్థానం ఉంది. కొండపల్లి, తిరుచానూరు, నిర్మల్, ఏటికొప్పాక ప్రాంతాలలో ఈ బొమ్మలను ఇంకా తయారు చేస్తున్నారు. ఆ ప్రాంతాలలో విరివిగా లభించే తెల్లపొన్నికి కొయ్యతో ఈ బొమ్మలను తయారుచేస్తారు. ఆర్య క్షత్రియ కుటుంబాలకు చెందిన కార్మికులు ఈ బొమ్మలను తరతరాలుగా చేస్తున్నారు.

పురాణ పాత్రలనూ, దృశ్యాలనూ, జానపద సన్నివేశాలనూ ఈ బొమ్మలతో రూపొంది స్తారు. మగ్గాలు నేసేవారు, రైతులు, వ్యాపారులు, తాడిచెట్లెక్కేవారు, పాములవాళ్ళు, గుడ్డలుతికేవాళ్ళు అంటూ రకరకాల బొమ్మలు చేస్తారు. నెమళ్ళు, చిలుకలు, కొంగలు వంటి పక్షుల బొమ్మలూ; ఒంటెలు, ఏనుగులు, గుర్రాలు, పులులు, ఎద్దులు వంటి జంతువుల బొమ్మలూ ఎంతో ఆకర్షణీయంగా తయారుచేస్తారు. పూర్వకాలంలో మొక్కలు, తీగలు, ఆకులు, వేళ్ళు, రాళ్ళు, జిగురు మొదలైనవాటిని కలిపి సహజమైన ఆ రంగులను బొమ్మలకు పూసేవారు. ఇప్పుడేమో రసాయనిక రంగులు ఉపయోగిస్తున్నారు.

దసరా సందర్భంగా పెట్టే బొమ్మల కొలువులో ఈ కొండపల్లి బొమ్మలను అమర్చినట్టయితే చాలా అందంగా, ఆకర్షణీయంగా ఉంటాయి!



చందమామ సమర్పిస్తున్న

# వసుధ





*In collaboration with*
KALPAVRIKSH
& NBSAP



**Sponsored by National Foundation for India**

# నేషనల్ ఫౌండేషన్ ఫర్ ఇండియా (ఎన్ ఎఫ్ ఐ)
# దశమ వార్షికోత్సవ సంకలనం!




దశమ వార్షికోత్సవం సందర్భంగా ఫోర్డ్ ఫౌండేషన్ ప్రెసిడెంట్ సుసాన్ బెరెస్ ఫోర్డ్, విడుదల చేసిన సంకలనం.

"...ముద్రణా నాణ్యత, రచయితల ఎంపిక (నన్ను కలుపుకోవడం లేదు సుమండీ!) ఈ రెండింటికీ ఎన్ ఎఫ్ ఐ ని తప్పకఅభినందించాలి. భారతదేశ నాగరక సమాజం మీద ఇలాంటి మంచి విషయాలను చూసినట్టు నాకు జ్ఞాపకం లేదు. ఎన్.ఎఫ్.ఐ ఇలాంటిది మళ్ళీ తీసుకు రావడానికి ఆలోచించవచ్చు...

– సుందర్ బుర్రా – అడ్వైజర్
ఎస్ పి ఎ ఆర్ సి. ముంబై

"...ఇది చాలా ఉపయోగకరమైన, ఆసక్తికరమైన సంకలనం.....

– ఆశిశ్ కొఠారి,
కోఆర్డినేటర్, ఎన్ బి ఎస్ ఎ పి

"...వ్యాసాలు చాలా సందర్భోచితంగానూ, ఆలోచనలు రేకెత్తించేవిగానూ ఉన్నాయి..."

– దీప్ జోషి,
పి ఆర్ ఎ డి ఎ ఎ ఎన్ (ప్రదాన్)

"...విశిష్ట రచయితల విలక్షణమైన కలయిక- ఎన్ ఎఫ్ ఐ దశమ వార్షికోత్సవాన్ని జరుపుకునే దీటైన పద్ధతి!...

– నీలిమ ఖైతాన్,
సేవామందిర్

**కామన్ కాజ్** (common cause)– స్వచ్ఛందరంగం పాత్ర, దాని భవిష్యత్తు గురించి వివిధ రంగాల నుంచి విభిన్న అభిప్రాయాలను ఒకేవేదికమీదికి తీసుకువస్తుంది. దిగువస్థాయి కార్యకర్తలు, ఉద్యమ నాయకులు, ఎన్ జీ ఓ స్థాపకులు, నిధి సహాయసంస్థల కార్యనిర్వాహకులు, రాష్ట్రస్థాయి పర్యవేక్షకులు, మేధావులు స్వచ్ఛందసేవా సంస్థల, కార్యక్రమాల విభిన్న పార్శ్వాలను స్పృశించి తమ అభిప్రాయాలనూ, ఆలోచనలనూ వెలిబుచ్చారు. సమానత్వ, ప్రజాస్వామ్య ఆశయాల సాఫల్యానికి అడ్డుకట్టలుగా ఉన్న సంధిగ్ధాల ముసుగు తొలగించి, పరిష్కరించవలసిన తక్షణ అవసరాన్ని వ్యాసాలు ప్రతిబింబిస్తున్నాయి. **కామన్ కాజ్** అన్నది కేవలం ఆలోచించడానికి అవకాశం కల్పించడమేకాక, భారతదేశంలోని స్వచ్ఛందసేవా రంగంలో నూతన చర్చలకు దారిచూపగలదని వ్యాసకర్తలు విశ్వసిస్తున్నారు.



*ప్రతులకోసం సంప్రతించండి:*
నేషనల్ ఫౌండేషన్ ఫర్ ఇండియా
కోర్ IV ఎ, యు జి ఫ్లోర్, ఇండియా హ్యాబిటట్ సెంటర్,లోడీ రోడ్, న్యూఢిల్లీ–**110 003**
Ph: 464 18 64/65, 464 84 90/92 Fax: 464 18 67
Email: info@nfi.org.in Website: www.nfi.org.in

## ప్రియమైన మిత్రులకు!

యేటా జూన్ 5వ తేదీన వచ్చే ప్రపంచ పర్యావరణ దినోత్సవ సందర్భంగా—వన్యప్రాణులనూ, చెట్లనూ రక్షించవలసిన అవసరం గురించి ఆనవాయితీగా నాలుగు ముక్కలు మాట్లాడడం, అంతటితో దానిని గురించి మరిచిపోవడం జరుగుతూంటుంది. అయితే, ఈ యేడు పర్యావరణ దినాన్ని భిన్నంగా జరుపుకుందాం. మనదేశంలోని చెట్లు, మొక్కలు, జంతువులు, పక్షులు, జలచరాలు, సూక్ష్మ జీవులు, మనుషులు మొదలుగాగల రకరకాల అద్భుతప్రాణులనూ, వాటి ఆవాసాలనూ గురించి తెలుసుకుందాం. మన జీవ సంపదను గురించి రేఖామాత్రంగా తెలియజేయడానికి చందమామ జీవవైవిధ్యంపై ప్రత్యేక అనుబంధం 'వసుధ'ను వెలువరిస్తోంది. నేషనల్ ఫౌండేషన్ ఫర్ ఇండియా 'వసుధ'కు ప్రాయోజితులు. పర్యావరణ కార్యాచరణబృందం 'కల్పవృక్ష' కావలసిన విషయాలను అందించింది.

జీవవైవిధ్యం అంటే ఏమిటి? దానిని ఎందుకు పరిరక్షించాలి? అన్న విషయాలను 'వసుధ' తెలియజేస్తుంది. కొన్ని అరుదైన, విలక్షణమైన జంతు, వృక్ష జాతులనూ; అబ్బురపరచే మనదేశంలోని రకరకాల పంటలనూ మీముందుకు తీసుకువస్తుంది. జీవపరిరక్షణకు పాటుపడిన వ్యక్తులను మీకు పరిచయం చేస్తుంది. అయితే వసుధను పూర్తివివరాలు కలిగిన పరిపూర్ణ 'అనుబంధం' అని చెప్పలేము. స్థలాభావం కారణంగా మేము ఉద్దేశించిన కొన్ని విషయాలను ప్రస్తావించలేకపోయాము. ముఖ్యంగా నీటి జంతువులను గురించి తెలియజేయలేకపోయాము. 'వసుధ' పరిపూర్ణమైనది కాకపోయినా - మీలో జీవవైవిధ్యంపట్ల ఆసక్తిని రేకెత్తించి, ప్రకృతిపట్ల ప్రేమను కలిగిస్తుంది. పాఠకులలో ప్రాణులపట్ల ఆసక్తి, వాటిని పరిరక్షించుకోవడానికి ఏదో ఒకటి చేయాలన్న తపన కలిగించినట్టయితే చాలు. మా ప్రయత్నం సఫలమైనట్టే భావించగలం. చిన్నచిన్న నీటిబొట్లు కలిస్తేనే మహాసముద్రమవుతుందన్న సత్యం గుర్తుంచుకోవాలి!

మీ ప్రియమైన,

Viswam

విశ్వం
సంపాదకుడు, చందమామ

సాంకేతిక సలహాదారు:
కల్పవృక్ష/ ఎన్ బి ఎస్ ఎ పి
చిరునామా:
అపార్ట్-5, శ్రీ దత్త కృప, 908, దక్కన్ జింఖానా,
పూనే-411 004. ఇండియా.
టెలి/ఫ్యాక్స్: 020-5654239
E-mail: kalpavriksh@vsnl.net

## జీవవైవిధ్యం—ప్రభుత్వాలు

భారతదేశంలోని చెట్లనూ, జంతు జాతులనూ పరిరక్షించడానికి కేంద్ర, రాష్ట్ర ప్రభుత్వాలు బాధ్యత వహిస్తున్నాయి. చెట్లు పెరిగే సహజ ప్రాంతాలనూ, జంతువులు నివసించే ప్రదేశాలనూ 'జాతీయోద్యానాలుగా' 'అభయారణ్యాలుగా' ప్రకటించడం ద్వారా ఇది సాధ్యమవుతున్నది. ఈ ప్రదేశాలలో మనుషులు నడయాడకుండా కట్టుదిట్టం చేయడంవల్ల ఇక్కడ వన్యజీవనం ప్రశాంతంగా కొనసాగుతున్నది. భారతదేశంలోని 5 శాతం భూభాగంలో ఇలాంటి ప్రదేశాలు 550 కిపైగా ఉన్నాయి. దాదాపు వేటనంతా నిషేధిస్తున్న వన్యజీవ(పరిరక్షణా)చట్టం కూడా వన్యప్రాణులకు రక్షణ కల్పిస్తోంది. దురదృష్టవశాత్తు పంటలకూ, పశుగ్రాస వైవిధ్యానికి వాటితో సమానమైన ప్రాధాన్యతను ఇవ్వడం లేదు; అయినా వాటిని ప్రత్యేకంగా పెంచే నారుమళ్ళ కేంద్రాలూ, సీడ్ బ్యాంకులూ ఉన్నాయి. అయితే, ఇన్ని చర్యలు తీసుకుంటున్నప్పటికీ, కొన్ని జాతుల చెట్లూ, జంతువులూ నశించిపోయే తీవ్రమైన అపాయాన్ని ఎదుర్కొంటున్నాయి. వాటిని రక్షించడానికి వన్యప్రాణుల ఆవాసాలకు సమీపంలో నివసిస్తూన్న మీరూ, మేమూ, మీలాంటి పిల్లలూ తగిన చర్యలు తీసుకుంటేనే జీవవైవిధ్యాన్ని కాపాడగలమని ప్రభుత్వం గుర్తిస్తున్నది... మీరు మాతో చేతులు కలపాలనుకుంటున్నారా? మీకు సమీపంలో ఉన్న పరిరక్షిత ప్రాంతాన్ని కనుగొని, వాటిని రక్షించడానికి మీరు ఎలాంటి సాయం చేయగలరో ఆలోచించి నడుం బిగించి కార్యరంగంలోకి దిగండి!

Designed and produced by Chandamama India Ltd., 82 Defence Officers Colony
Ekkatuthangal, Chennai - 600 097. Phone : 234 7384, 234 7399. Website : www.chandamama.org.

# అబ్బురపరచే చిన్నా, పెద్ద ప్రాణులు!

మీరు రకరకాల జంతువులనూ, చెట్లనూ చూస్తూ ఉంటారు. అయితే, వాటి పేర్లు మీకు తెలుసా?యాభైకన్నా ఎక్కువ పేర్లు చెప్పగలిగితే చాలా గొప్పవిషయమే! అయితే, మనం ఇక్కడ మరొక విషయం తెలుసుకోవాలి. మన దేశంలో అరణ్యప్రాంత గ్రామాల్లో, సముద్ర తీరాల్లో నివసించే పిల్లలు చాలా మంది వంద పేర్లకు పైగా చెప్పగలరు. కొందరయితే కొన్ని వందల పేర్లు కూడా గడగడా చెప్పగలరు. వీళ్ళందరూ చాలా వరకు బడుల చాయలకు వెళ్ళనివాళ్ళే!

సరే, ఆ సంగతి అలా ఉంచుదాం. ఇప్పుడు ధాన్యాల విషయానికి వద్దాం. బియ్యంలో, గోధు మలో, జొన్నల్లో ఎన్నేసి రకాలున్నాయో తెలుసా? మీలో ఎవరైనా పది రకాల ధాన్యాల పేర్లు చెప్పగలిగితే, మిమ్మల్ని అభినందించాల్సిందే అయితే, ఇక్కడ గుర్తుంచుకో వలసిన మరొక ముఖ్యమైన విషయం ఉంది. మణిపూర్, కేరళ, లేదా చట్టీస్‌ఘడ్ గ్రామాలలోని పిల్లలు కొన్నిడజన్ల పంటల పేర్లు అవలీలగా చెబుతారు! ఒక్క మన భారతదేశంలోనే 1,25,000 రకాల (జాతుల) మొక్కలూ, జంతువులూ ఉన్నాయన్న సంగతి మీకు తెలుసా? మనం ఇంకా కనుగొనని (ముఖ్యంగా కంటికి కనిపించని మైక్రో ఆర్గనిజమ్స్) చాలా ఉండవచ్చు. ఇది ప్రపంచ వ్యాప్తంగా ఉన్న దాదాపు ఐదు లక్షలకు మించిన జాతులలోని చిన్న భాగం మాత్రమే. ఇది 'జీవ వైవిధ్యం' లో ఒక భాగం. జీవ్యావరణ శ్రేణులు (అడవులు, తటాకాలు, నదులు, తీరాలు, సముద్రాలు, పర్వతాలు, గడ్డి మైదానాలు, ఎడారులు...) జీవ జాతులు, ఆయా ప్రాంతాలలోని వైవిధ్యాలు వీటన్నిటినీ కలిపి జీవ వైవిధ్యం అంటారు.

మనచుట్టూ ఉన్న జీవవైవిధ్యం కనుమరుగవుతున్నది. జంతువులు వేటాడబడుతున్నాయి, వాటి ఆవాసాలు నిర్మూలించబడుతున్నాయి. మొక్కలు నరకబడుతున్నాయి; వాతావరణ కాలుష్యం వాటిని ఊపిరాడనివ్వడంలేదు. (మనల్ని కూడా!) మనం ఇప్పుడు ఇక్కడ ప్రస్తావించిన వైవిధ్యంలో నాలుగో వంతు, మీకు మీ తాతల, బామ్మల వయసు వచ్చేలోగా నశించిపోతుంది. వాటిని నాశపరుస్తున్నది

ఎవరు? వేరెవరో కాదు, మనమే! మన పెరుగు తూన్న పరిశ్రమలు, విస్తరిస్తూన్న పట్టణాలు; ఇంకా ఇంకా ఎక్కువ ప్లాస్టిక్స్, కాగితాలు, విద్యుత్తు ఉపయోగించాలనే, చిరుతిండ్లు తినాలనే మన కోరికలు!

మనకు మనం చూడకలిగిందల్లా కేవలం మనుషులే అన్న పరిస్థితి ఏర్పడితే జీవితం ఎంత నిస్తేజంగా, విసుగ్గా ఉంటుందో ఒక్కసారి ఊహించి చూడండి. అయితే, జీవవైవిధ్యం మరెన్నో విధాలుగానూ ప్రధానపాత్ర పోషిస్తోంది. మీరు తాగే పాలు, కట్టుకునే నూలు బట్టలు, మీ ఇంట్లో వడ్డించే రకరకాల ఆహారాలు, మీరు వాడే కొన్నిమందులు, శ్వాసించే ప్రాణవాయువు వీటన్నిటినీ గురించి ఒక్కసారి ఆలోచించి చూడండి. ఇవన్నీ, ఇంకా మరెన్నో, భూమిపై నెలకొన్న సంక్లిష్ట జీవవైవిధ్యంతో సంబంధం కలిగిఉన్నాయి!

అందువల్ల ఈ జీవవైవిధ్యాన్ని పరిరక్షించడానికి మీరేమైనా చేయాలనుకుంటున్నారా? ఇప్పటికే చాలామంది పిల్లలు—జాతీయ జీవవైవిధ్యం—వ్యూహం కార్యాచరణ పథకం నేషనల్ బయోడైవర్సిటీ, స్ట్రేటజీ అండ్ యాక్షన్ ప్లాన్ (ఎన్ బి ఎస్ ఎ పి) ద్వారా కార్యరంగం లోకి దిగారు. ఇది పర్యావరణం అడవుల మంత్రిత్వ శాఖ పథకం. దీనికి కల్పవృక్ష అనే ఇరవై రెండేళ్ళ, పర్యావరణ కార్యాచరణ సంస్థ సమన్వయ కర్తగా వ్యవహరిస్తుంది. బయోటెక్ కన్సోర్టియమ్ ఇండియా లిమిటెడ్ పరిపాలనా వ్యవహారాలను నిర్వహిస్తుంది.

మహారాష్ట్ర విదర్భ ప్రాంతంలోని పాఠశాల విద్యార్థులు—చెట్లనుంచి తయారుచేసిన వ్యవసాయపు పనిముట్లు, మూలికల టూత్ బ్రష్‌లు, దారాలు మొదలైన వాటితో ఒక ప్రదర్శన ఏర్పాటుచేశారు. ఢిల్లీ, చెన్నయ్, నగరాల నుంచి వచ్చిన వికలాంగ విద్యార్థులు 'చర్చా కార్యక్రమంలో' లో పాల్గొని మన జీవవైవిధ్య పరిరక్షణలో పిల్లలందరూ పాలు పంచుకునేలా చేయాలని చెప్పారు. కర్నాటకలో, రాష్ట్రవ్యాప్తంగా పిల్లలు తమ గ్రామాల సమీపాలలో ఉన్న చెట్లూ, జంతువుల పేర్లను సేకరిస్తూ 'జీవవైవిధ్యాన్ని గుర్తించే కార్య క్రమం'లో పాల్గొంటున్నారు.

పిల్లలే కాకుండా దేశవ్యాప్తంగా వేలాది మంది ప్రజలు ఎన్ బి ఎస్ ఎ పి కార్యక్రమాలలో పాల్గొంటున్నారు. మనదేశంలో మిగిలి వున్న జీవవైవిధ్యాన్ని పరిరక్షించుకోవడం ఎలాగా అని పథకాలు రూపొందిస్తున్నారు. ఈ వైవిధ్యం మీద ఆధారపడి వున్న ప్రజల జీవితాలకు భద్రత కలిగించడం ఎలాగా అని... అంటే, ప్రకృతి ప్రసాదిస్తున్న కానుకలను మనమందరం ఎప్పటిలాగే అనుభవించడానికి కృషిచేస్తున్నారు.

మనం కూడా వాళ్ళలాగే మన పరిసరాలలోని చెట్లనూ, జంతువులనూ రక్షించడానికి మనవంతు కృషిచేయాలి.

మనదేశంలో గత
100 సంవత్సరాలలో
నశించిపోయిన
ఒక సస్తనజంతువు
పేరు చెప్పండి.

చిరుతపులి (చీటా - అసినోనిక్స్ జుబాటస్).
1948 లో ఛత్తీస్ గఢ్ బస్తర్‌లో కనిపించింది.
చిరుతల గురించి మనదేశంలో లభిస్తున్న చిట్ట
చివరి సాధికార రికార్డు ఇదే.

చిటికెడు మన్ను తీసి మీ అరచేతిలో ఉంచారనుకోండి. ఇప్పుడు మీరు 10 బిలియన్ బ్యాక్టీరియాలను పట్టుకుని ఉన్నారన్నమాట! నమ్మగలరా? ఇది నిజం. అది సరే, ఒక బిలియన్ అంటే ఎంత ఉంటుందో తెలుసా? మీ పెన్‌క్యాప్ సైజును బిలియన్‌రెట్లు పెంచగలిగితే ప్రపంచాన్నంతా అందులో ఇమడ్చవచ్చు!

– సుజాతా పద్మనాభన్
– ఆశిష్ కొఠారి

# అద్భుత వృక్ష ప్రపంచం!

## వింతలు..విశేషాలు

ఈ బొమ్మలను చూడండి. మన భారత దేశంలో నమోదయిన మొత్తం 47,000 జాతుల మొక్కలలో ఇవి 6 మాత్రమే. ఇక్కడ మొక్కల బొమ్మలూ, వాటిని గురించిన వివరణలూ కలగాపులగంగా కలిసిపోయాయి. జాగ్రత్తగా చదివి, వివరణలను సరైన మొక్కలతో జతపరచగలరేమో ప్రయత్నించి చూడండి!




**A**

### లిచెన్

శైవలం, శిలీంధ్రం(ఆల్గా, ఫంగస్) ఈ రెంటి కలయిక లిచెన్. ఈ ఏర్పాటు రెండింటికీ ఉపయోగకరం. లిచెన్‌లోని శిలీంధ్ర (ఆల్గల్)భాగం దానంతట అదే ఎండిపోయి తొందరలో చచ్చిపోవాలి. అయితే ఫంగల్ ఫైబర్స్ వాటిని ఎండిపోనీకుండా కాపాడి సాయపడతాయి. దానికి ప్రత్యుపకారంగా ఆల్గా కిరణజన్య సంయోగక్రియ ద్వారా బోలెడంత ఆహారాన్ని తయారుచేసి, దానిని శిలీంధ్రతో పంచుకుంటుంది. ఫంగస్‌లో పత్రహరితం లేదు గనక అది స్వయంగా ఆహారాన్ని తయారుచేసుకోజాలదు.

వాతావరణ కాలుష్యంవల్ల లిచెన్లు దారుణంగా దెబ్బతింటాయి. ఇవి మామూలుగా పెరిగేచోట కనిపించలేదంటే ఆ ప్రాంతంలో వాయుకాలుష్యం మరీ ఎక్కువ అనడానికి అది సూచన అని గ్రహించవచ్చు!

**B**

### కుసుమ్ వృక్షాలు

(ష్లీచేరా ఓలియోసా)

పట్టణాలలోని పార్కులలో, రోడ్లకు ఇరువైపులా చాలా అందమైన పుష్పవృక్షాలు కనిపిస్తాయి. వీటిలో చాలావరకు ఇతర దేశాలకు చెందినవే కావడంవల్ల, ఇక్కడున్న పక్షులకూ, ఇతర ప్రాణులకూ ఆధారంగా ఉండలేకపోతున్నాయి. అయితే ద్వీపకల్ప భారతదేశంలో కనిపించే కుసుమ్‌వృక్షం అసలు సిసలైన భారతీయవృక్షం.

మరీ ఎత్తూ ,పొట్టీ కాకుండా మామూలు ఎత్తుగా పెరిగే కుసుమ్ వేసవి ప్రారంభం కాగానే చిగురించడం మొదలెడుతుంది. ఎర్రటి రంగులో మిలమిలలాడే ఈ ఆకులను పువ్వులనుకుని పొరబడే అవకాశం కూడా ఉంది. నిప్పులు చెరిగే మండు వేసవిలో ఈ చెట్లు సేద తీర్చే చల్లని నీడనిస్తాయి.

ముదిరిన కుసుమ్ వృక్షాలకు తొర్రలు ఏర్పడతాయి. ఇవి తొండలు, ఉడతలువంటి జంతువుల నివాసానికి అనుకూలంగా ఉంటాయి. పక్షులూ, ఉడతలూ వీటి పళ్ళను తింటాయి. గింజల నుంచి తీసే నూనె, దోమలను తరిమే మందుగానూ, శిరోజాలకు పూసే నూనెగానూ ఉపయోగపడుతుంది. అందువల్ల మీరు మునుముందు అలంకారం కోసం చెట్లు నాటాలనుకుంటే కుసుమ్ చెట్టును నాటడం మరిచిపోకండి.



**C**

## సన్‌డ్యూ (డ్రోసిరా బర్మానీ)

ఒక మొక్క కదులుతూ, కీటకాలను పట్టి తింటుందని ఎవరైనా చెబితే మీరు నమ్మ గలరా? నమ్మలేరు. అయితే, అది నిజం. మనదేశంలో కీటకాలను పట్టి తినే (కీటకాహార) మొక్కలు చాలా ఉన్నాయి. అలాంటి వాటిలో సన్‌డ్యూ ఒకటి. మామూలుగా దాదాపు ఒక రూపాయి నాణెమంత వెడల్పూ, అంతే ఎత్తూ కలిగిన చిన్న మొక్క ఇది. బురద ప్రాంతాలలో ఇవి పెరుగుతాయి. వీటి ఆకుల మీద మంచు బిందువుల్లాంటి జిగట ద్రవబిందువులు ఉండడం వల్ల, దీనికీపేరు వచ్చింది. చిన్న కీటకాలు వీటిని మంచుబిందువులని భ్రమ పడి వాటిమీద వాలడమో, వాటిమీదికి ఎగ బ్రాకడమో చేస్తాయి. అంతే, అలాగే ఆకుల మీద అతుక్కుపోతాయి. ఆ తరవాత ఆకులు మెల్లగా మూసుకుపోయి, వాటిని జీర్ణం చేసేస్తాయి!


3

4

**D**

## గుల్‌వెల్ (టినోస్పోరా కార్డిఫోలియా)

ఔషధ గుణాలు గల ఈ మొక్క గుండె ఆకారంలో ఆకులు కలిగిన తీగ మరీ పొడవుగా, ఒక్కొక్కసారి చెట్టునంతా అల్లుకుపోయేలా విపరీతంగా పెరుగుతుంది. దాదాపు భారత దేశమంతటా కాస్త పొడి వాతావరణం ఉన్న ప్రాంతాలలో ఇది పెరుగుతుంది. ఈ మొక్క తీగముక్కలతో తయారు చేసే కషాయాన్ని కొన్ని వ్యాధుల నివారణకూ, బలవర్ధకంగానూ ఉపయో గిస్తారు. మామూలుగా ఏ తీగనైనా నరికినట్టయితే తెగిన పైభాగం కొన్ని రోజులలో ఎండిపోతుంది. అయితే ఈ తీగను నరికినట్టయితే, లేదా నాశ పరచినట్టయితే, తెగిపోయిన పైభాగం నుంచి వేళ్ళు పుట్టుకొచ్చి నేలకేసి దిగుతాయి!

**E**

## ఫాక్స్‌టైల్ ఆర్చిడ్ (రైన్‌చోస్టైలిస్ రెటూసా)

మనదేశం దక్షిణ, ఈశాన్య ప్రాంతాలలోని ఉష్ణప్రదేశాలలో కనిపించే ఫాక్స్‌టైల్ ఆర్చిడ్స్, చెట్లమీద పెరుగుతాయి. వేసవి కాలంలో నక్కతోక ఆకారంలో పెద్దపెద్ద గుత్తులుగా లేత ఎరుపు పువ్వులు పూస్తాయి. చెట్లపై పెరిగిన ఇతర ఆర్చిడ్స్‌లాగే, ఇవి కూడా పెరిగే చెట్టు బెరడులపై ప్రత్యేకంగా లావుగా ఏర్పడిన పచ్చటి వేళ్ళ సాయంతో గాలిలోని నీళ్ళనూ ఇతర పోషక పదా ర్థాలనూ గ్రహిస్తాయి. చెట్టును ఆధారంగా కలిగి ఉండడం తప్ప, చెట్టునుంచి దేన్నీ గ్రహించదు; ఎలాంటి హానీ చేయదు.

5

రచన-చిత్రాలు: వివేక్ గౌర్-బ్రూమె

# విత్తనాల రక్షణ!

ఆంధ్రప్రదేశ్‌లో ఉన్న గంగవరం అనే గ్రామంలోని ఒక చిన్న గుడిసెలో నివసిస్తోంది అంజమ్మ. గుడిసె చాలా చిన్నదేగాని, అంజమ్మ ఆ ఇంటి గది ఇంట్లో ఒక మూలగా యాభై బుట్టలను అమర్చిఉంచింది. తాము ఏళ్ళ తరబడి పండిస్తున్న ధాన్యాల విత్తనాలను భద్రపరచడానికి. వడ్లు, జొన్నలు, ఆవాలు, అపరాలు, ఇతర నూనెగింజలు.. ఇలా చాలారకాలు. వాటిలో ఒక్కొక్కదానిలో మరెన్నో రకాలు. యేటా పంట ఇంటికి రాగానే, అందులోని శ్రేష్ఠమైన విత్తనాలను సేకరించి, భద్రపరచడం ఆమె మొదటి పని. విత్తనాల గింజలకు క్రిమికీటకాల బెడద సోక కుండా మన్ను, వేపాకు, బూడిద పొరల మధ్య వాటిని బుట్టలలో పోసి, భద్రం చేస్తుంది!



అంజమ్మలాగే మనదేశంలో చాలామంది రైతులు తాము పండించిన పంటలో శ్రేష్ఠమైన విత్తనాలు సేకరించి, వచ్చే పంటకోసం భద్రపరుస్తారు. ఇలా చేయలేదంటే ఈ పంటలలోని కొన్నిరకాలు ఈపాటికి నశించిపోయి ఉండేవి. పంటల్లో వైవిధ్యం చాలా అవసరం. అరటినే తీసుకోండి. పెద్ద పసుపు పచ్చ అరటిపండు; మామూలు సైజు పసుపుఅరటి; పచ్చఅరటి; ఎర్రగా ఉండేవి.. ఇలా చాలా ఉన్నాయి కదా! దీనినే పంట వైవిధ్యం అంటారు! మన దేశంలో **16** రకాల బంగాళా దుంపలూ; **42** రకాల కొబ్బరి కాయలూ; **124** రకాల అల్లమూ; **1000** రకాలకు పైగా మామిడీ, (ఆశ్చర్యపోకండి!) వరిలో **50,000-60,000** రకాలూ ఉన్నాయి!!

అదిసరే, వరిలో ఇన్ని రకాలు, మామిడిలో ఇన్ని రకాలూ ఉన్నాయి కదా మరి వాటిలో అలాంటి వైవిధ్యాన్ని కాపాడుకోవలసిన అవసరం ఏమిటా అని ఆశ్చర్యపోతున్నారు కదూ! వాటిని పండించే రైతునడిగితే ఎన్నో కారణాలు చెబుతాడు. వాటిలో కొన్నిటిని చూడండి... విభిన్నమైన రకాలకు విభిన్నమైన నేలలు, నీటి వసతులు అవసరమవుతాయి; అవి విభిన్న కాలాలలో నూర్పిడికి వస్తాయి. (అంటే సంవత్సరం పొడవునా ఆహారం లభిస్తుందన్నమాట) విభిన్నమైన క్రిమికీటకాలకు తట్టుకునే శక్తి కలిగి ఉంటాయి. అందువల్ల రైతులు ఒకటికి పైబడ్డ రకాలను పైరు చేసినట్టయితే, అవి యేడాదిలో వచ్చే కరువుకాటకాలు, వెల్లువలు లేదా క్రిమి కీటకాల బెడదలనుంచి తప్పించుకో గలవు. పండుగలు, పబ్బాల సందర్భంగానూ, రకరకాల రుచులు కలిగి ఉండడంవల్ల కూడా విభిన్నమైన రకాలు పండిస్తారు.

మీరు పళ్ళూ, కూరగాయలూ, వెచ్చాలూ కొనడానికి వెళ్ళినప్పుడు, వాటిలోని రకాలను పరిశీలించి చూడండి. అన్నిరకాల పంటలు పండిస్తూ, పంట వైవిధ్యాన్ని కాపాడుతూన్న అంజమ్మలాంటి కోట్లాది రైతుల కృషి తెలుస్తుంది!

– సుజాతా పద్మనాభన్



# రక్షించడమే మతంగా...

గ్రామం పొలిమేరలో పశువులూ, గేదెలతో కలిసి నల్లజింకలూ, చింకారాలూ చిన్నచిన్న గుంపులుగా మేస్తున్నట్టు ఒక్కసారి ఊహించుకోండి చూద్దాం. అదీ రాజస్థాన్ ఎడారి ప్రాంతంలో అయితే మరీ అద్భుతంగా ఉంటుంది. అభూత కల్పనలా కనిపించినప్పటికీ ఇది పచ్చి నిజం. ఈ అద్భుతానికి కారణం బిష్ణోయీలు. సర్వ ప్రాణికోటికీ, ఆమాటకు వస్తే–చెట్టు చేమలకూ, క్రిమికీటకాలకూ, చేపలకూ కూడా జీవించే హక్కూ, ప్రకృతి సంపదలో భాగస్వామ్యం ఉందని బిష్ణోయీలు విశ్వసిస్తారు.

ఇదంతా రాజస్థాన్ నాగౌర్ జిల్లాలోని ఒక గ్రామవాసి, జంబోజీతో ఆరంభమయింది. 1503 వ సంవత్సరంలో జన్మించిన జంబోజీని ఆయన అనుచరులు గురుమహారాజ్ జంబోజీ అని పిలుస్తారు. ఎండిపోయిన థార్ఎడారి ప్రాంతంలో మనుషులు మనుగడ కొనసాగించాలంటే అక్కడి జీవవైవిధ్యాన్ని పరిరక్షించాలన్న పరమ సత్యాన్ని ఆయన గ్రహించాడు. 1542 లో బిష్ణోయ్ తన ప్రచారాన్ని ప్రారంభించాడు. అందుకు 29 నియమాలను రూపొందించాడు.

ప్రాణం ఏ రూపంలో ఉన్నా, బిష్ణోయీలు దానిని పరిరక్షిస్తారు. ఎండు పుల్లలను పొయ్యిలో పెట్టేప్పుడు కూడా, ఆ పుల్లలలో ఏవైనా కీటకాలుంటే తీసివేస్తారు. కఠినమైన శాకాహారులు. పొగ తాగరు. పచ్చి మొక్కలకు హాని కలిగించకూడదన్న ఉద్దేశంతో, పచ్చి మొక్కల నుంచి తయారుచేసే కొన్ని రకాల రంగులను కూడా వాళ్ళుఉపయోగించరు. రైతులు భూమిని దున్నుతారు. అయితే, అలా దున్నడం వల్ల, బలహీనమైన ఎడారి జీవ్యావరణ విధానానికి అతి తక్కువ హాని మాత్రమే జరిగేలా జాగ్రత్తలు తీసుకుంటారు. ఎడారి మొక్కలను మేసేస్తాయి గనక, రైతులు మేకలనూ, గొర్రెలనూ పెంచడం లేదు.

జోధ్‌పూర్‌ను పరిపాలించిన రాజు అభయ్ సింగ్ 1737 వ సంవత్సరంలో రాజభవనంలో జరిగిన వేడుకకు ఎక్కువగా వంటచెరకు తెమ్మని తన మనుషులను పంపాడు. రాజుగారి మనుషులు 'ఖేజ్రీ' చెట్లను నరకడానికి పూనుకున్నప్పుడు ఆ ప్రాంతంలోని బిష్ణోయీలు అభ్యంతరం చెప్పి, అడ్డుపడ్డారు. ఆఖరికి చెట్లను కౌగిలించుకుని పక్కకు తప్పుకోవడానికి ఒప్పుకోలేదు. రాజసైనికులు 363 బిష్ణోయీలను చంపారు. ఆ సంగతి తెలిసి రాజు హుటాహుటిగా వచ్చి మారణ కాండను ఆపాడు.

బిష్ణోయీలు ప్రస్తుతం రాజస్థాన్, హర్యానా, పంజాబ్ ప్రాంతాలకు విస్తరించారు. వాళ్ళు నివసిస్తున్న గ్రామాలు, చుట్టూ పచ్చటి చెట్టూ చేమలతో ఎడారిలో సేదతీర్చే జలాశయాల్లాగా మనసుకు హాయికలిగిస్తాయి.

– టీనా థామస్

భారతదేశంలోని అతిపెద్ద భూచర సస్తనజంతువు ఆసియా ఏనుగు. మరి అతి చిన్న జంతువేదో తెలుసా? బొటనవేలు ప్రమాణంలో ఉండే పిగ్మీష్రూ.

మహారాష్ట్రలోని వర్లీ తెగ చిత్రకళాసంప్రదాయం ప్రకారం ఈ వర్ణచిత్రం చిత్రీకరించబడింది.

తెలియవస్తుంది. ఒకదానిపై ఒకటి ఆధారపడి ఉన్నవి ఈ చిత్రంలో మొత్తం ఎన్ని ఉన్నాయో లెక్కగట్టి, జాబితా తయారుచేసి, రూ.500/- బహుమతి అందుకుంటాయి. మీ ఎంట్రీలు పంపవలసిన చిరునామా:
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుతాంగల్, చెన్నయ్-600 097.

# జర్దార్ గ్రామ పునర్జన్మ

ఈరోజు విజయ్‌జీ వాహ్యాళికి కొండపైకివెళ్ళాలని బయలుదేరాడు. విజయ్‌జీ జర్దార్ గ్రామప్రజల గౌరవాభిమానాలకు పాత్రుడైన గ్రామపెద్ద.

ఉత్తరాంచల్ రాష్ట్రంలోని కొండసానువుల మీదఏర్పడిన గ్రామం జర్దార్. విజయ్‌జీ ఆ రోజు సిందూర వృక్షాలూ, రొడొడెండ్రాన్ అడవులూ దట్టంగా ఉన్నచోటికివెళ్ళాలనుకున్నాడు. ఆయన కొండపైకి వెళుతూన్నకొద్దీ—ఆ కొండ మీది అడవికి మళ్ళీ ప్రాణం తీసుకురావడానికి తన గ్రామప్రజలు చేసినకృషి ఆయనమనోనేత్రాల ముందు కదలాడ సాగింది. అవన్నీ ఆరంభమయిన 1980వ సంవత్సరం గుర్తుకు రాగానే ఆయన పెదవులపై చిరునవ్వు కదలాడింది.

అంతకుపూర్వం ఆ గ్రామస్థులు అడవిలోని చెట్లను నరికి ఇతర ప్రాంతాలవారికి అమ్ముకునేవారు. అడవులను రక్షించే హక్కు బాధ్యతలు గల అటవీశాఖ కూడా దీనిని చూసీచూడనట్టు ఊరుకున్నది. చాలా సంవత్సరాలుగా ఆ అడవికి ప్రభుత్వ అధికారులు ఉన్నారు గనక, ఆ అడవి ప్రభుత్వానికి సొంతమనీ, తమది కాదనీ భావించడంవల్లనో ఏమో... దాని రక్షణను గ్రామస్థులు అసలు పట్టించుకోలేదు!



అడవిలో మిగిలివున్న ఒకే ఒక దేవదారు చెట్టును రఘువీర్ ఒకనాడు నరుక్కునివచ్చాడు. గ్రామస్థులు పట్టరాని ఆవేశంతో వెళ్ళి ఫారెస్టుగార్డుకు ఫిర్యాదు చేస్తామన్నారు. అయితే, తనకు పూర్వం ఎవరెవరు ఎన్నెన్ని చెట్లు నరికారో అధికారులకు రఘువీర్ చెబుతానని బెదిరించాడు.

ఇది గ్రామస్థుల మధ్య లేని పోని తగాదాలకూ, తీరని ప్రతీకారాలకూ దారితీయగలదని గ్రామపెద్ద విజయ్‌జీ గ్రహించాడు. రఘువీర్ మీద ఫిర్యాదు చేయకుండా సమస్యను తమ మధ్యే పరిష్కరించుకోమని గ్రామ ప్రజలకు సలహా ఇచ్చాడు. ప్రజలందరూ గ్రామపెద్దను గౌరవించడంవల్ల, ఆయన సలహాను పాటించారు.

ఈ సంఘటన వాళ్ళల్లో ఒక నూతన స్ఫూర్తికి బీజం నాటింది. ఉన్నట్టుండి తమ గ్రామం ఉన్న దీనస్థితిని గ్రామస్థులు చూడసాగారు. ఒకప్పుడు గ్రామపరిసరాలలో దట్టంగా ఉన్న అడవి ఇప్పుడు నశించిపోయింది. సెలయేళ్ళు ఎండిపోతున్నాయి. పశుగ్రాసం తగ్గిపోయింది. స్త్రీలు వంట చెరకు కోసం చాలాదూరం వెళ్ళి రావలసిన కష్టాలను గురించి చెప్పుకున్నారు.

ఆ రోజు సాయంకాలమే సర్పంచ్ గ్రామ సభ ఏర్పాటుచేశాడు. సుదీర్ఘమైన చర్చల తరవాత, తమ అడవులను మళ్ళీ పెంచుకుంటే తప్ప తమకు భవిష్యత్తు లేదన్న నిర్ణయానికి వచ్చారు. 'అటవీ సంరక్షణాసమితి'ని ఏర్పాటు చేయాలనుకున్నారు. చెట్లు నరకడం నిషేధించారు. అడవిలో లభించే ఇతరవస్తువులను ఎలా ఎంత వరకు ఉపయోగించాలి, ఎలా క్రమ బద్ధం చేయాలి అన్న విషయం మీద నియమావళిని రూపొందించారు. పర్వత సానువుల లోని అటవీ సంపద రక్షణకు

పరమేశ్వర్, రన్నోదేవి అనే ఇద్దరు కాపలాదారులను నియమించారు. వాళ్ళకు బత్తెంగా ఇంటింటికీ కొంత ధాన్యం ఇచ్చేలా ఏర్పాటు చేసుకున్నారు. నియ మాలను అతిక్రమిం చినవారిని 'సమితి' ముందు నిలబెట్టేవారు. సమితి, వాళ్ళను కఠి నంగా శిక్షించేది. మూడు నెలల వరకు ఎవరు

మనదేశంలో గ్రామీణ ప్రజలూ, గిరి జనులూ అవలంబిస్తున్న సుసంపన్న జానపదవైద్య విధానాలు ఉన్నాయని మీకు తెలుసా? వాళ్ళు దాదాపు 50,000 రకాల ఔషధాలు తయారుచేడానికి 4,500 పైగా చెట్ల జాతులను ఉపయోగిస్తున్నారు.

గాని అడవిలోకి అడుగుపెట్టకూడదని చెప్పారు. పరమేశ్వర్ తన బాధ్యతల నిర్వహణకు ఈ నియమాన్ని అతిక్ర మించినవాళ్ళను పట్టు కోడానికి దుడ్డుకర్రతో వెళ్ళేవాడు. అయితే, రన్నోదేవిని చూడగానే గ్రామస్థులు మరింత భయపడసాగారు. ఎందుకంటే అటవీ పరిరక్షిత ప్రాంతాలలో మనుషుల జాడ కనిపిస్తేచాలు దేవి రాళ్ళు విసురుతూ శాపనార్థాలతో కేకలు పెట్టేది!

కొన్ని సంవత్సరాలు గడిచాయి. క్రమంగా పర్వతసానువుల్లో చెట్టుచేమలతో పచ్చదనం తిరిగి రాసాగింది. వేసవిలో ఎండిపోయే సెల యేళ్ళు, ఇప్పుడు సంవత్సరం పొడవునా ప్రవ హించసాగాయి. గడ్డి ఒత్తుగా పెరగసాగింది. చెట్లు వాటంతట అవే పెరగసాగాయి.

ఒకప్పుడు పలుచగా అక్కడక్కడా చెట్లున్న ప్రదేశంలో ఇరవైయేళ్ళల్లో దట్టమైన అరణ్యం ఏర్పడింది.

ఈ రోజు ఆ దృశ్యాన్ని చూస్తూంటే విజయ్ జీకి ఎంతో ఆనందం కలిగింది.

కొండశిఖరాన్ని చేరుకున్న విజయ్‌జీకి, కొండ పాదతలంలోని లోయనుంచి పులి గాండ్రింపు వినిపించింది. బహుశా తాను నిశ్చింతగా దాగి వుండడానికి వీలుగా దట్టమైన అడవీ; వేటాడ డానికి జింకలూ ఉండడంవల్ల అడవిరాజు పులి కూడా అక్కడ మళ్ళీ నివాసం ఏర్పరచుకుం దన్నమాట! అడవిలో పులి తిరుగుతున్నంత కాలం అడవిలోకి చెట్లు నరుక్కుపోవడానికి ఎవరూ రాలేరు.

ఇవన్నీ గ్రహించడంవల్ల విజయ్‌జీ తృప్తిగా నవ్వుకున్నాడు. – రోష్నీ కుట్టి

## తేడాలను గుర్తించండి!



పదేళ్ళ క్రితం గ్రామం దగ్గరి కొలను ఉన్న తీరు..

..ఈరోజు అదే దృశ్యం..



రెండు దృశ్యాలకూ మధ్య ఉన్న తేడాలను మీరు గుర్తించగలరా?

# వింతగొలిపే వన్యప్రాణులు

మనలాగే ఈ దేశానికి చెందిన జంతు ప్రపంచంలోని కొన్ని అద్భుత ప్రాణుల చిత్రాలు ఇక్కడ ఉన్నాయి. భారతదేశంలో నమోదయిన **81,000** జాతుల జంతువులలో ఇవి కేవలం 5 మాత్రమే...

## హూలాక్ గిబ్బన్
### (హైలోబేట్స్ హూలాక్)

ఈశాన్య భారతదేశంలోని కొన్ని ఋతుపవన అరణ్యాల్లో ఈ గిబ్బన్లు కనిపిస్తాయి. నశించిపోతున్న స్థితిలోవున్న ఈ జంతువే భారతదేశానికి చెందిన ఏకైక వాలిడి. అంటే తోకలేని కోతి. (ఇది కోతిలాగా కనిపిస్తుందే గాని, కోతి కన్నా భిన్నమైనది.) పెద్దవైన మగ గిబ్బన్లూ, చిన్న ఆడ గిబ్బన్లూ నల్లటి శరీరం రంగు కలిగి ఉంటాయి. పెద్దవైన తర్వాత ఆడ గిబ్బన్లు మాత్రం లేతపసుపు పచ్చ రంగులో ఉంటాయి. వాటి కాళ్ళకన్నా, చేతులు పొడవుగా ఉంటాయి. గుబురుగా ఉన్న చెట్ల మధ్య ఒక చెట్టుపై నుంచి మరొక చెట్టు మీదికి కొమ్మలను బలమైన చేతులతో పట్టుకుని ఊగుతూ దాటుతూ ఉంటాయి. ఇవి కుటుంబాలుగా నివసిస్తాయి. పళ్ళు, ఆకులు, కాయలు , కీటకాలు, పురుగులు మొదలైనవాటిని తింటాయి. తెల్లవారక ముందే ఇవి ఆకుల మీది మంచు బిందువులను జుర్రుకుంటాయి.


Abi Tamim


Vivek Gour- Broome

## జ్యువెల్ బీటిల్

పెద్ద కందిరీగల్లాంటి జ్యువెల్ బీటిల్ ఆకర్షణీయమైన రంగులతో మెరిసే శరీరం కలిగి ఉంటుంది. పెరిగిన పురుగులు ఋతుపవనాల సమయంలోనే ముఖ్యంగా కనిపిస్తాయి. ఇది స్వల్పకాలమే బతికి, ఋతుపవనాల చివర చనిపోతుంది. ఈలోగా సంతానోత్పత్తి చేయడం, లేత శిరీషవృక్షాల వేళ్ళ సమీపంలో గుడ్లు పెట్టడం పూర్తిచేస్తుంది. గుడ్లనుంచి వెలుపలికి వచ్చాక,లార్వా వేళ్ళనూ, వేళ్ళ బెరడునూ తిని బతుకుతుంది. దానికి యుక్తవయసు రావడానికి తొమ్మిది నెలలు పడుతుంది. పెద్దదైన పురుగు,అదే చెట్టులోని ఆకులను తిని బతుకుతుంది. ఈ జ్యువెల్ బీటిల్స్ ఉండే ప్రాంతాలలో నివసించే గిరిజనులు వీటి మెరిసే రెక్కలను నగలు తయారుచేయడానికి ఉపయోగిస్తారు.

## గ్రేట్ ఇండియన్ బస్టర్డ్ (బట్టమేక)
### (ఆర్డియోటిస్ నిగ్రిసెప్స్)

అరుదుగా కనిపించే అతిపెద్ద భారతీయ పక్షి ఏది? అదే గ్రేట్ ఇండియన్ బస్టర్డ్ (బట్టమేక). నశించి పోయే అపాయంలో ఉన్న జాతిపక్షి గనక, అది చాలా అరుదుగా కనిపిస్తుంది. భారతదేశంలోని చాలా పొడి బయలు ప్రాంతాలలో కనిపించేవి. అయితే, ఇప్పుడు ఆ ప్రదేశాలలోని పదోవంతు ప్రాంతాలకే పరిమితమై పోయాయి. ఇవి చూడడానికి చిన్న నిప్పుకోళ్ళలా ఉంటాయి. మొక్కల చిగుళ్ళనూ; తొండలు, మిడతలు, జెర్రులు మొదలైన చిన్న ప్రాణులనూ పట్టి తింటాయి. చాలా కాలం క్రితం, పక్షులను వినోదం కోసం


Asad Rahmani/Sanctuary Photolibrary

వేటాడేవాళ్ళు. వ్యవసాయ భూములు పెరగడంవల్ల కూడా వీటి ఆవాసస్థలాలు చాలావరకు హరించుకుపోయాయి. వీటి సంఖ్య తగ్గడానికి ఇవే ప్రధాన కారణాలు. ప్రస్తుతం ఈ పక్షులు పశ్చిమ, మధ్య భారతదేశంలో కనిపిస్తాయి, కాని అడవులలో తారసపడడం మాత్రం చాలా అరుదుగా ఉంటోంది!


Vivek Gour-Broome

## చర్మంవీపు తాబేలు
### (డెర్మో చెలిస్ కోరియాసీ)

అద్భుతమైన ఈ ప్రాణి ప్రపంచంలోని సముద్రపు తాబేళ్ళలోకెల్లా చాలా పెద్దది. మిగిలిన తాబేళ్ళకు లాగా వీటికి రక్షణగా దృఢమైన తొడుగు ఉండదు. దీని వీపుమీది తొడుగు మందమైన చర్మంలాగా ఉంటుంది. ఇదిబాగా ఈద గలుగుతుంది. జీవిత మంతా సముద్రంలోనే గడుపుతుంది. ఇది ముఖ్యంగా జెల్లీ చేపల్ని తింటుంది. ఆడ తాబేళ్ళు సంవత్సరానికి ఒకసారి సముద్రం నుంచి వెలుపలికి వచ్చి, ఇసుక తీరాలుగల అండమాన్ నికోబార్ దీవులలోనూ, ఇతర దక్షిణాసియా ప్రాంత ఇసుక తీరాలలోనూ గుడ్లు పెడతాయి. ఒకప్పుడీ తాబేళ్ళు విరివిగా కనిపించేవి. అయితే వీటిని వేటాడడం; ఇవి చేపలు పట్టే వలల్లో చిక్కుకుపోవడం; ఇవి గుడ్లుపెట్టి పొదిగే సముద్ర తీరాలలో అంతరాయాలు, ఇబ్బందులు ఏర్పడడం మొదలైన కారణాల వల్ల ఇటీవల వీటి సంఖ్య దారుణంగా తగ్గిపోయింది.

## పగడాలు


Pankaj Sekhsaria

సముద్రజలాలలో జూ-ప్లాంక్టన్ తింటూ గుంపులు గుంపులుగా జీవించే నెగడు అనే అతి చిన్న తంతునాగ పురుగులు పగడాలు. సముద్ర జలాలనుంచి గ్రహించే కాల్షియం కార్బొనేట్‌తో తమ చుట్టూ కవచం లేదా అస్థిపంజరాన్ని ఇవి ఏర్పరచుకుంటాయి.అస్థిపంజరాలతో గల రకరకాల పగడాల సమూహమే పగడాల దిబ్బలుగా కనిపిస్తాయి. వందలాది సముద్ర ప్రాణులకు ఇవి నివాసం కల్పిస్తాయి. సజీవంగా ఉన్న పగడాలు మామూలుగా నీలం, పచ్చ, ఊదా, పసుపు పచ్చరంగుల్లో ఉంటాయి. అవి మామూలుగా నిర్మలంగా ఉన్న ఉష్ణప్రాంత జలాలలో నివసిస్తాయి. భారతదేశంలోని లక్షద్వీపాలలో, అండమాన్ నికోబార్ దీవులలో అద్భుతమైన పగడాల దిబ్బలు ఉన్నాయి.

రచన-చిత్రాలు: వివేక్ గౌర్-బ్రూమే

# జీవవైవిధ్యమూ-మీరూ

మన ఇంటివద్దా, బడిలో, సెలవుల్లో ఎక్కడికైనా వెళ్ళినప్పుడూ చేసే పనులన్నీ మనకు సమీపంలోనూ, దూరంగానూ ఉన్న చెట్టు చేమలనూ, జంతువులనూ ప్రభావితం చేయవచ్చు. ఉదాహరణకు చెప్పాలంటే చాలామంది నగరవాసులు తమ ఇళ్ళకు చలువరాళ్ళూ, చదునుచేసిన నల్లరాళ్ళూ వెయ్యాలనుకుంటారు. బావుంది, ఇవి చాలా అందంగా కనిపిస్తాయి. అయితే ఈ చలువరాళ్ళను భూమి లోపలి నుంచి తవ్వి వెలుపలికి తీస్తారు. అలా చేసేప్పుడు మొదట అక్కడి చెట్టు చేమలను నిర్మూలించవలసి ఉంటుంది. అలా అడవులను నరికివేయడం వల్ల అక్కడి జంతువులు కూడా నిర్మూలించబడుతున్నాయి అన్న సంగతి గుర్తుంచుకోవాలి.

కింద కనబరచిన ప్రశ్నల సమాధానాలు రెండింటిలో ఒక దానిని ఎంపిక చేయండి. ఆ తరవాత, దానికి కింద ఇవ్వబడిన స్కోరింగ్ సూచనల ప్రకారం మీకెన్ని పాయింట్లు వస్తాయో లెక్క కట్టి మీరు ఎంతటి జీవవైవిధ్య మిత్రులో తెలుసుకోండి. ఆ తరవాత ఉన్న సమాచారం మనం అనునిత్యం చేసే పనులు పర్యావరణం మీద ఎంతటి ప్రభావం చూపుతుందో వివరిస్తుంది.

1. మీరు ఇంటి నుంచి చాలాదూరం వెళ్ళవలసివచ్చినప్పుడు, దాహం వేస్తే

(ఎ) నీళ్ళబాటిల్, లేదా ప్యాక్ చేసిన శీతల పానీయాలను కొనుక్కుని తాగుతారా?

(బి) ఇంటినుంచే నీళ్ళబాటిల్ తీసుకు వెళ్ళడం, కొబ్బరినీళ్ళు, నిమ్మరసం లేదా లోటాలలో మజ్జిగ తీసుకోవడం చేస్తారా?

2. మీకు ఏ ఆటలంటే చాలా ఇష్టం

(ఎ) కేవలం మీ బలం మాత్రం అవసరమయ్యే ఔట్‌డోర్ క్రీడలా?

(బి)బ్యాటరీతో పనిచేసే ఉపకరణాలు పట్టుకుని ఆడే ఆటలా?

3. మీరు ధరించేవి

(ఎ) పాలియెస్టర్, టెర్రీకాటన్ లేదా నైలాన్‌లతో తయారైన బట్టలా?

(బి) నూలు బట్టలా?

4. మీరు మామూలుగా బడికి వేళ్ళేది

(ఎ) కారులోనా? ప్రైవేట్ వాహనంలోనా?

(బి) నడిచా, సైకిల్‌మీదా లేక బస్సులోనా?

5. మీరు మీ మిత్రులకు ఉత్తరాలు రాసేప్పుడు

(ఎ) కాగితానికి ఒకవైపున మాత్రమే రాస్తారా?

(బి) కాగితానికి రెండువైపులా రాస్తారా?

భారతదేశంలో ఉన్న చిలుకలు 'ప్యారట్స్' కావు. నిజమా? అబద్ధమా?

**స్కోరింగ్:** పైప్రశ్నలకు ఇక్కడ జీవవైవిధ్య మైత్రీ సమాధానాలు ఇవ్వబడ్డాయి. దాంతోపాటు ఇంకొక సమాధానం ఎందుకు సరైనది కాదు అన్నదానికి కారణం కూడా వివరించబడింది. సరైన ప్రతి జీవవైవిధ్య మైత్రీ సమాధానానికీ 10 పాయింట్లు వేసుకోండి. కానప్పుడు 10 పాయింట్లు తగ్గించుకోండి. మొత్తం మీద మీరు 50 పాయింట్లు సంపాయించారంటే మీరు నిజంగానే జంతువులకూ, చెట్లకూ మిత్రులన్నమాట! 40 పాయింట్లకన్నా తక్కువ వచ్చినట్టయితే మీరు జీవవైవిధ్య మిత్రులనిపించుకోవడానికి మీ జీవనశైలిని మార్చుకోవలసి ఉంటుంది!

1బి. బ్రాండ్ చేయబడిన నీళ్ళను మామూలుగా ప్లాస్టిక్ బాటిల్స్‌లోనూ,సంచుల్లోనూ అమ్ముతారు. ఇవి 'నాన్ బయొ డిగ్రేడబుల్' అంటే నాశపరచడానికి వీలుకానివి. ఈ ప్లాస్టిక్ మాలిన్యాలను ఆహారంగా పొరబడి జంతువులూ, పక్షులూ, చేపలూ తింటాయి. ఉదాహరణకు చెప్పాలంటే తాబేళ్ళు పలుచటి ప్లాస్టిక్‌ను జెల్లీ చేపగా పొరబడి తిని ప్రాణాలు పోగొట్టుకుంటాయి. ఇక చిన్న పెట్టెల్లా ఉండే, టెట్రా ప్యాక్స్ విషయానికి వచ్చామంటే వెలుపలి పొరను దళసరి కాగితంతోనూ, లోపలి పొరను పలుచటి అల్యూ మినియంతోనూ తయారుచేస్తారు. మనం కాగితం తయారుచేయడానికి చెట్లను నరుకుతున్నాం. అడవులను నిర్మూలించి అల్యూమినియం తయారు చేయడానికి ఉపయోగించే బాక్సైటును తవ్వి బయట కుతీస్తున్నాం. ఉపయోగించాక పారవేసిన అల్యూ మినియం పొర మట్టిలో మట్టిగా కలిసిపోదు.

2ఎ. బ్యాటరీలలో సీసం ఉంటుంది. దీనిని పారవేసినప్పుడు జంతువుల మీద దారుణ ప్రభావం చూపుతుంది. మనుషులలో మితిమించిన సీసం మానసిక అభివృద్ధిని దెబ్బ తీస్తుంది; నాడీమండల రుగ్మతలకూ, రక్తపు పోటుకూ దారితీస్తుంది. ఇక చిన్నా చితకా ప్రాణులపై దీని ప్రభావం ఊహించుకోవల సిందే! ఇండియాలో, ఉపయోగించిన బ్యాటరీలను ఒక క్రమపద్ధతిలో నాశపరచడంలేదు.

3బి. పాలియెస్టర్, ఇతర కృత్రిమ వస్త్రాలన్నీ పెట్రోలియం నుంచి తయారయ్యేవే. పెట్రోలియం కోసం తవ్వుతూ మనం చమురు లభ్యమయ్యే ప్రదే శాన్నిబట్టి, అడవులనూ, జలప్రాణులనూ నిర్మూ లిస్తున్నాము.

4బి. మనం బస్సులాంటి ప్రభుత్వ వాహనాన్ని ఉపయోగించుకున్నప్పుడూ, మనతోపాటు ఇతరులూ దానినే ఉపయోగిస్తారు. అవిధంగా ఇంధనం పొదు పవుతుంది.ప్రైవేటు వాహనం ఉపయోగించడం కన్నా దీనివల్ల వాయుకాలుష్యంకూడా తక్కువే.

5బి. కాగితం తయారుచేయడానికి చెట్లను నరుకు తారు. కాగితంలో ఒక వైపున మాత్రమే రాయడం వల్ల మనం ఎక్కువ కాగితాలను ఉపయోగించవలసి వస్తుంది. పరోక్షంగా జంతువుల నివాసస్థానమైన అడవుల నిర్మూ లనకు కారకులవుతాం.

**- శాంత భూషణ్**




## పజిల్స్ సమాధానాలు

**చిన్నా, పెద్ద ప్రాణులు:** గ్రేట్ హార్న్ బిల్ (బెరిత), నెమలి, తూనీగ, ఖడ్గ మృగం, పులి, మొసలి, తొండ, మడ్ స్కిప్పర్, పీత, చేప, కప్ప, హంస, ఉడత, పిచ్చుక, కోతి, తాబేలు, నత్త, జింక, ఎలుగుబంటి, సీతాకోక చిలుక, కొండచిలువ, కింగ్‌ఫిషర్, పారకీట్, మట్టి పాము, చెట్టు, తామర, గడ్డి, మనీప్లాంట్.

**అద్భుత వృక్షసంపద:** ఎ-3, బి-5, సి-2, డి-1, ఇ-4

**తేడాలు గుర్తించండి:** తేనెతుట్టె, తక్కువైన పక్షులు, చచ్చిన చేపలు, చెట్టుమోడు, గుడిసెల స్థానంలో డాబా ఇల్లు, కొలనులోకి చెత్తను వేస్తున్న స్త్రీ, పొదలలో తక్కువ పువ్వులు.

**జత చేయండి:** 1-డి; 2-ఎ; 3-బి; 4-సి

# సరదాగా రంగులద్దుదాం!

బట్టలకు కొత్తరంగులు వేయాలనుకున్నప్పుడు, రసాయనిక పదార్థాలతో తయారు చేసిన రంగులు ఉపయోగించకండి. కొత్త పద్ధతికి మార్గదర్శకులు కండి! తువ్వాళ్ళకు, గుడ్డ సంచులకు, ఇతర దుస్తులకు ఉపయోగించే రంగులను కూరగాయలతో తయారు చేసుకోవచ్చు. అయితే ఒక విషయం. సింథెటిక్ బట్టలకు ఈ రంగులు వేయడానికి ప్రయత్నించకండి. రంగులు వేయడాన్ని ఒక పాత నూలు తువ్వాలుతో గానీ, చేతి గుడ్డతోగానీ ప్రారంభించవచ్చు. అది తెల్లదిగానో లేదా బాగా రంగు వెలిసిపోయినదిగానో ఉండడం ముఖ్యం.

మామూలు సైజులో వున్న రెండు మూడు బీట్‌రూట్ దుంపలను చిన్నచిన్న ముక్కలుగా తరుక్కోండి. ఆ ముక్కలను ఒక వెడల్పాటి పాత్రలో వేయండి. ముక్కలు మునిగేవరకు నీళ్ళు పోయండి. మరొకరి సాయంతో స్టవ్‌ను ముట్టించి, పాత్రను దానిపై ఉంచండి. నీళ్ళు వేడెక్కేకొద్దీ అవి బీట్‌రూట్‌లా ఎర్రగా మారి పోతాయి! పాత్రను సెగపై నుంచి కిందికి దించి బీట్‌రూట్ ముక్కలు తీసి పక్కన పెట్టండి. ఇప్పుడు మీ డై (రంగు) రెడీ. (ఉడకబెట్టిన బీట్‌రూట్ ముక్కలు రుచికరమై సలాడ్‌గా పనికివస్తాయి.) ఇప్పుడు మళ్ళీ పాత్రను సెగపై ఉంచి నీళ్ళు తెర్లేలా చేయండి. ఆ తరవాత చేతిగుడ్డను అందులోకి వేసి శుభ్రమైన పుల్లతోగానీ, గరిటతోగానీ కలియబెట్టండి. బట్టకు రంగు బాగా హత్తుకున్న తరవాత, స్టవ్‌ను ఆఫ్ చేయాలి. ఒక రాత్రంతా బట్టను రంగునీళ్ళల్లో అలాగే ఉంచాలి.

రంగు మరీ దృఢంగా (వెలిసిపోకుండా) ఉండాలంటే నీళ్ళల్లో కొంచెం వెనిగర్ కలపాలి.

బీట్‌రూట్‌తో పాటు లేత ఎరుపు కోసం హోలీహాక్, కుశుంబ పుష్పాలు, జపపుష్పాలు, ఉల్లిపాయ పొరలు మొదలైన వాటినీ; పచ్చ రంగుకు స్పినాచ్ ఆకులూ; పసుపురంగుకు ఇప్ప బెరడు, పళ్ళు; నలుపు ఊదారంగులకు ఎండబెట్టి, ఉడికించిన ఉసిరిక ఫలాలూ ఉపయోగించవచ్చు. ఇతర రంగులు తయారు చేయడానికి ఆకులూ, పువ్వులతో ప్రయత్నించి చూడండి. కొత్తకొత్త ప్రయోగాలు చేయండి!

కావలసినప్పుడు రంగులు తయారు చేయడానికి అపరాజిత, మందార, జకరంద, కుంకుమలాంటి పుష్పాలనూ, గోరింటాకు వంటి ఆకులనూ ఎండబెట్టి భద్రపరచవచ్చు. రంగులు వెలిసిపోకుండా ఉండడానికి పూలను నీడలో ఎండబెట్టాలన్న విషయం గుర్తుంచుకోండి. కాబట్టి మీకు మరెప్పుడైనా 'డై' కావలసివస్తే ఎండు పూరేకులను రాత్రంతా నీళ్ళల్లో నానబెట్టడమే తరువాయి! ప్రయత్నించి చూడండి!

-శ్రుతిదేవి

1970లలో హిమాలయ ప్రాంతంలో చెట్లు నరకబడకుండా అడ్డుకోవడానికి, ప్రజలు చెట్లను కౌగిలించుకునే ఒక ఉద్యమం జరిగింది. ఆ ఉద్యమం పేరేమిటో తెలుసా?

చిప్కో ఉద్యమం

[సంకలనం: సీమా భట్]

# నేషనల్ ఫౌండేషన్ ఫర్ ఇండియా (ఎన్ ఎఫ్ ఐ)

ప్రత్యేక హక్కులంటూ లేని బడుగు ప్రజల అభ్యుదయానికి దోహదంచేసే అభివృద్ధి పథకాలకు చేయూతనిచ్చే లక్ష్యంతో స్థాపించబడిన స్వతంత్ర భారతీయనిధి సహాయసంస్థ ఎన్.ఎఫ్.ఐ. న్యాయమైన సమసమాజంలో ఆత్మగౌరవంతో, పరువుతో జీవించే హక్కు ప్రతివ్యక్తికీ ఉందని ఈ ఫౌండేషన్ గుర్తిస్తోంది. వ్యక్తుల, సముదాయాల సమర్థతను పెంచుకోవలసిన అవసరాలకు స్పందిస్తూ, వారి జీవన ప్రమాణాలను పెంపొందించి, సామాజిక ప్రతిబంధకాలను సవాలుచేయడానికి ఉద్యమిస్తోంది.

## మా కార్యక్రమాలు

**స్త్రీ పురుష సమానత్వం-న్యాయం :** ఈ కార్యక్రమం ప్రధానంగా ఆడశిశువు ఎదుర్కొనే ప్రాణరక్షణ, హక్కుల అపహరణ సమస్యల చుట్టూ కేంద్రీకరించబడుతున్నది. స్త్రీ శిశు హత్యలు, భ్రూణ హత్యలు, స్త్రీ పురుష నిష్పత్తిలో తీవ్ర లోపం మొదలైన సమస్యల గురించి సముదాయాలను జాగృతం చేయడం ద్వారానూ; సిద్ధాంత రూపకల్పన, పరిపాలనా రంగాలలో వ్యూహాత్మక జోక్యంద్వారానూ వాటిని పరిష్కరించడానికి కృషిచేస్తోంది.

**ప్రజావ్యవహారాలు, నగరప్రాంత పాలన:** ప్రజలందరూ పాలుపంచుకునే అభివృద్ధి కార్యక్రమాలు; మరింత ఆధిపత్యం కల్పించడంద్వారా అధికార వికేంద్రీకరణ; పారదర్శకత - జవాబుదారీతనం; దారిద్ర్య నిర్మూలన మొదలైన వాటిద్వారా మానవాభివృద్ధిని సాధించి, రక్షించడానికి దోహదం చేసే పరిపాలనా విధాన అవసరాన్ని తెలియజేయడానికి ఈ కార్యక్రమం పాటుపడుతోంది. రిపోర్టు కార్డ్ స్టడీస్ ఎన్ ఎఫ్ ఐ ప్రోత్సహిస్తోంది. ఎన్నికయిన ప్రతినిధులకు శిక్షణనిస్తోంది; స్థానికపాలనలో ఉత్కృష్టతను ప్రోత్సహించడానికి అవార్డులు నెలకొల్పింది.

**ప్రాంతీయ అసమానతలు తగ్గించడం:** ఈశాన్యప్రాంతంలో పేరుకొనిన సామాజిక ఆర్థిక అసమానతలు-ఫౌండేషన్‌ను స్థానిక ఎన్‌జీవోలతో చేతులు కలిపి-స్త్రీ పురుష భేదాలు, ఉపాధి, పర్యావరణ సమస్యలకు సంబంధించిన సమాజ అభివృద్ధి కార్యక్రమాలకు నడుం బిగించేలా చేసింది. స్థానిక ఎన్‌జీఓలు తమ కార్యరంగంలో అభివృద్ధిసమస్యలను సమర్థవంతంగా ఎదుర్కోవడానికి కావలసిన శక్తిసామర్థ్యాలను పెంపొందించుకునేందుకు శిక్షణ ఇవ్వడానికీ; సమాచారం, ఆలోచనలు, విషయపరిజ్ఞానం పరస్పరం మార్చుకోవడానికీ; పరిశోధన, డాక్యుమెంటేషన్‌లను ప్రోత్సహించడానికీ ఫౌండేషన్ కృషిచేస్తోంది.

**డెవెలప్‌మెంట్ కమ్యూనికేషన్:** ప్రస్తుతం నెలకొన్న సముదాయస్థాయి అభివృద్ధి చొరవకు తోడుగా ఆధునిక కమ్యూనికేషన్ పరికరాలను ఉపయోగించే విధంగా సముదాయాలను శక్తివంతం చేయవలసిన అవసరాన్ని గుర్తించి, డెవెలప్‌మెంట్ కమ్యూనికేషన్ కార్యక్రమం రూపొందించబడింది. ఫౌండేషన్ అభివృద్ధి కార్యకలాపాలతో చేయీ చేయీ కలిపి లక్ష్యించిన పథకాలు అభివృద్ధిచేయడానికి ఈ కార్యక్రమం ఉద్దేశించబడింది. ఎన్ ఎఫ్ ఐ మీడియా ఫెలోషిప్పులనూ, అభివృద్ధి అంశాల మీద జర్నలిస్టులు పరిశోధనలు/రచనలు చేయడానికి వీలుగా నార్త్ ఈస్ట్ మీడియా ఎక్స్‌చేంజ్ ప్రోగ్రాం ఏర్పాటు చేయబడింది.

**ఎన్ ఎఫ్ ఐ ఇన్నొవేషన్స్ ఫండ్ (ఎన్.ఐ.ఎఫ్):** ఇంగ్లాండులో సెంటర్ ఆఫ్ ఇన్నొవేషన్స్ ఇన్ వాలంటరీ యాక్షన్ (సి ఐ వి ఎ) మరియు ఓ ఎక్స్ ఎఫ్ ఎమ్ సహాయంతో ఫౌండేషన్ ఎన్ ఐ ఎఫ్ ని ప్రారంభించింది. ఆరోగ్యం, స్వచ్ఛంద సేవా రంగాలలో విప్లవాత్మక వినూత్న పథకాలకు చిన్న మొత్తాలను ఈ నిధి మంజూరు చేస్తుంది.



మరిన్ని వివరాలకోసం : నేషనల్ ఫౌండేషన్ ఫర్ ఇండియా,
ఇండియా హ్యాబిటట్ సెంటర్ - కోర్ 4-ఎ, లోడీరోడ్, న్యూఢిల్లీ 110 003.
Ph: 464 18 64/65, 464 84 90/92 Fax: 464 18 67
Email: root@nfi.org.in Website: www.nfi.org.in

# భారతరత్న సి. సుబ్రహ్మణ్యం
## ఫెలోషిప్స్ ఫర్ కమ్యూనిటీ లీడర్‌షిప్ అండ్ సస్టెయినబుల్ లైవ్లిహూడ్స్

నేషనల్ ఫౌండేషన్ ఫర్ ఇండియా వ్యవస్థాపక అధ్యక్షులు మాజీ ఆహార, వ్యవసాయశాఖ మంత్రి శ్రీ సి. సుబ్రహ్మణ్యం గౌరవార్థం భారతరత్న సి. సుబ్రహ్మణ్యం ఫెలోషిప్స్ ఫర్ కమ్యూనిటీ లీడర్‌షిప్ అండ్ సస్టెయినబుల్ లైవ్లిహూడ్స్ నెలకొల్పబడింది.

యేటా ఇచ్చే ఈ ఫెలోషిప్‌లు రెండురకాలు : స్వచ్ఛందసేవారంగానికి చెందిన కార్యకర్తలకు ఫెలోషిప్‌లు; కమ్యూనిటీ లెవల్ అంటే సముదాయస్థాయి నాయకత్వానికి ఫెలోషిప్‌లు.

మొత్తం నాలుగు ఫెలోషిప్‌లు - యేటా ఒక్కొక్క విభాగం కింద 1 లక్ష రూపాయల విలువగల రెండేసి ఫెలోషిప్‌లు ఇవ్వబడతాయి. ఈ ఫెలోషిప్‌లకు ఫోర్డ్ ఫౌండేషన్ సాయపడుతోంది.

ఫెలోషిప్‌కు ఎంపిక చేయబడిన స్వచ్ఛందరంగ కార్యకర్తలు-ప్రధాన విద్యాసంస్థలలో ప్రవేశపెట్ట బడతారు. అక్కడ వారు ఆహారం, జీవనోపాధుల భద్రతతో ప్రత్యక్ష సంబంధం కలిగిన కార్యకర్తలతో, అధ్యాపకులతో-కలిసి పనిచేయడానికీ, చర్చించడానికీ వీలు కల్పించబడుతోంది. తమ నైపుణ్యాన్నీ, నాయకత్వ లక్షణాలనూ పెంపొందించుకోవడంతోపాటు సురక్షిత జీవనోపాధుల గురించి మరింత లోతుగా అవగాహన చేసుకోవడానికి ఈ ఫెలోషిప్‌లు అవకాశం కల్పిస్తాయి.

కమ్యూనిటీస్థాయి నాయకత్వానికి ఇచ్చే ఫెలోషిప్‌లు-స్వచ్ఛందసంస్థలు తామంత తాము కమ్యూనిటీస్థాయి కార్యకర్తలలో నాయకత్వ లక్షణాలు పెంపొందేలా, కార్యక్రమాలు నిర్వహించడానికి సాయపడతాయి. సామర్థ్యం పెంపుదల, సాంకేతిక సాధికారత; భూమి, నీరు, అడవులు మొదలైన సహజవనరులను రక్షించి, కావలసినంతమేరకే ఉపయోగించుకోవడం గురించి, దృష్టిని కేంద్రీకరిస్తాయి.

### అర్హతలు:

- అనుభవజ్ఞులైన స్వచ్ఛందరంగ కార్యకర్తలు.
- స్త్రీలు, ముఖ్యంగా ఆహార, జీవనోపాధుల భద్రతపట్ల ఆసక్తి కలిగినవారు.
- సురక్షిత జీవనోపాధులలో అనుభవంగల కమ్యూనిటీ నాయకులు.

### దరఖాస్తులతోపాటు జత చేయవలసినవి:

- క్లుప్తంగా విద్యార్హతలు, ఇతర వివరాలు.
- గతంలో చేపట్టిన కార్యక్రమాల గురించి సంక్షిప్త వివరణ.
- ఫెలోషిప్ గ్రాంటుతో దరఖాస్తుదారు చేపట్టడానికి ఉద్దేశించిన నిర్దిష్ట కార్యక్రమం గురించిన వివరాలు.




మరిన్ని వివరాలకు సంప్రదించండి:

నేషనల్ ఫౌండేషన్ ఆఫ్ ఇండియా, కోర్-4 ఎ, అప్పర్ గ్రౌండ్‌ఫ్లోర్, ఇండియా హ్యాబిటట్ సెంటర్, లోడీ రోడ్, న్యూఢిల్లీ 110 003.

Ph: 464 18 64/65, 464 84 90/92 Fax: 464 18 67

Email: info@nfi.org.in Website: www.nfi.org.in

# ప్రధానమంత్రికి లేఖ రాయండి!

జీవవైవిధ్యాన్ని పరిరక్షించాలనే స్ఫూర్తిని 'వసుధ' మీలో ప్రేరేపించింది కదూ! దయచేసి ఈ ఉత్తరాన్ని చదివి సంతకం చేసి **'యాక్ట్ ఫర్ వసుధ' చందమామ ఇండియా లిమిటెడ్, ఈకాట్టుత్తాంగల్, చెన్నయ్-600 097** చిరునామాకు పోస్ట్‌చేయండి. మీ ఉత్తరాలన్నిటినీ కలిపి, తగినచర్య తీసుకోమని మీ తరఫున ప్రధానమంత్రికి పంపగలం!

---

ప్రియమైన ప్రధామంత్రిగారికి,

నమస్కారం. భావిభారత పౌరులుగా మేము ఆరోగ్యకరమైన ఉజ్వల భవిష్యత్తుకోసం ఎదురుచూస్తున్నాం. అయితే, నిత్యజీవితంలోమేము వాడుకుంటూన్న వివిధవస్తువులలో విషపూరిత పదార్థాలు విరివిగా ఉపయోగించబడుతూండడం మాకెంతో బాధాకరంగా ఉంటోంది. మా తండ్రులూ, తాతలూ నిరాడంబరంగా క్షేమమైన జీవితాలు సాగించారు. అయితే ఈనాటి పిల్లలమైన మమ్మల్ని నిరంతరం వ్యాపార ప్రకటనలు, ప్రచారాలు-మనుషులకూ, చెట్టుచేమలకూ, భూమికీ హానికలిగించే అపాయకరమైన, వస్తువులను ఉపయోగించమని ఊరిస్తున్నాయి.

1. రసాయనిక రంగులు, క్రిమిసంహారక మందులు, రసాయనిక ఎరువులలో ఉపయోగించే విషపూరిత పదార్థాలు; పివీసి, క్యారీ బ్యాగులకు ఉపయోగించే ప్లాస్టిక్స్; ఆహారపదార్థాలలో ఉపయోగించే రంగులూ, నిలువచేయడానికి ఉపయోగించేరసాయనిక పదార్థాలూ; సింథటిక్ వాసనద్రవ్యాలూ మొదలైనవాటి ఉత్పత్తులనూ, ఉపయోగాలనూ ఆపడానికి మీవల్ల సాధ్యమైనంత చర్య తీసుకోవాలని ప్రార్థిస్తున్నాం.

2. పై రసాయనిక పదార్థాలకు ప్రత్యామ్నాయంగా మనకూ, మనతోటి ప్రాణులకూ నిరపాయకరమైన మొక్కలతో తయారుచేసే రంగులూ, ఎరువులూ క్రిమిసంహారక మందులూ; గుడ్డసంచులూ మొదలైనవాటిని, ఉపయోగించడానికి ప్రాచుర్యం కలిగించి ప్రోత్సహించాలని వేడుకుంటున్నాం.

ఇక మా పరంగా మేము విషపూరిత ఉత్పత్తులను ఉపయోగించడం మానివేస్తామని శపథం చేస్తున్నాం. వాటికి బదులుగా మా నిత్యజీవితంలో పర్యావరణానికి హానికలిగించని క్షేమమైన ప్రత్యామ్నాయాలను ఉపయోగించగలమని ప్రమాణం చేస్తున్నాం. మా కుటుంబ సభ్యులనూ, మిత్రులనూ అలాగే చేయమని ప్రోత్సహిస్తాం.

మీరు మా భవిష్యత్తునూ, భూమిమీద నివసించే చెట్టుచేమల, జంతువుల భవిష్యత్తునూ రక్షించగలరని విశ్వసిస్తున్నాం.

ఈ విషయంగా మీ నుంచి ప్రత్యుత్తరం రాగలదని ఆశిస్తున్నాం. రాస్తారు కదూ!

(సంతకం)

పేరు:-------------------------- వయసు: ---------------

చిరునామా:----------------------------------------------

----------------------------------------------

## కాశ్మీరు జానపద కథ

తరచూ 'భూతలస్వర్గం'గా వర్ణించబడే జమ్మూ-కాశ్మీరు రాష్ట్రం మనదేశం ఉత్తర భాగంలో ఉంది. ఇది ఉత్తర రేఖాంశరేఖ 32.17 - 36.58 డిగ్రీల మధ్య; తూర్పు అక్షాంశరేఖ 37.26 - 80.30 డిగ్రీల మధ్య ఉంది.

పశ్చిమదిశలో పాకిస్తాన్, ఆఫ్ఘనిస్తాన్ దేశాలు; తూర్పున చైనా; దక్షిణాన హిమాచలప్రదేశ్ సరిహద్దులుగా కలిగిన రాష్ట్రం ఇది. భారతదేశ వైశాల్యంలో ఈ రాష్ట్రం 6వ స్థానంలోనూ, జనాభాలో 17వ స్థానంలోనూ ఉంది.

చల్లటి ఎడారి ప్రాంతాలయిన లధక్; అతి శీతలమైన కాశ్మీరు లోయ; ఉప ఉష్ణ ప్రాంతమైన జమ్మూ అంటూ మూడు విభిన్న విస్పష్ట శీతోష్ణస్థితులను కలిగివుందీ ఉత్తరాదిరాష్ట్రం. ఒకేరాష్ట్రంలో సముద్ర మట్టానికి 1000 అడుగుల నుంచి 28,500 అడుగుల ఎత్తువరకు కలిగిన విభిన్న ప్రాంతాలు ఉన్నాయి.

వేసవిలో ఒక రాజధాని, శీతాకాలంలో వేరొకరాజధాని అంటూ రెండు రాజధానులు కలిగిన ఏకైక రాష్ట్రం జమ్ము-కాశ్మీర్. శ్రీనగర్ వేసవి రాజధాని; జమ్మూ శీతాకాల రాజధాని. రాష్ట్ర ప్రజలు ఉర్దూ, కాశ్మీరీ, హిందీ, డోగ్రీ, పహారీ, లడఖీ భాషలు మాట్లాడతారు.

# చేప నవ్విన కారణం!

కాశ్మీరులో ఒకానొకప్పుడు ఫిరోజ్ షా అనే రాజూ, షకీలా అనే ఆయన రాణీ ఉండేవారు. ఒకనాడు రాణి, భవనం కిటికీ పక్కగా వీధిలో ఒకావిడ చేపలమ్ముతూ వెళ్ళడం చూసింది. చేపల గంపలోని చేపలలో ఒకటి విచిత్రంగా కనిపించింది. రాణి చేపలమ్మే స్త్రీని పిలపించి, "నీ దగ్గర ఆడచేపలు ఉన్నాయా?" అని అడిగింది.

"లేదు, మహారాణీ! నా దగ్గర మగచేపలు మాత్రమే ఉన్నాయి," అని ఆమె జవాబిచ్చింది.



ఆ మరుక్షణమే గంపలోని వింత చేప ఫక్కున నవ్వింది. దానిని చూసి రాణి అమితాశ్చర్యం చెందింది. ఆ సంగతి రాజుకు చెప్పి, చేప నవ్వుకు కారణమేమిటో తెలుసుకోమని వేడుకున్నది.

రాజాస్థానంలో వివేకవంతుడైన హుస్సేన్ అనే వజీరు ఉన్నాడు. రాజు ఆయనకు తరచూ కొత్త కొత్త సమస్యలను ఇచ్చి, పరిష్కరించమని చెప్పేవాడు. ఇప్పుడు రాజు అతన్ని చేప నవ్వుకు కారణం తెలుసుకోమని ఆజ్ఞాపించాడు. "వచ్చే అమావాస్యలోగా సమాధానం చెప్పకపోయావో, తల తీసేస్తా!" అని హెచ్చరించాడు.

దీనికి సరైన సమాధానం తెలుసుకోవడానికి దేశం నలుమూలలా తిరిగి రావాలని హుస్సేన్ నిర్ణయించాడు. అతడు అలా వెళుతూన్నప్పుడు రెహ్మాన్ అనే ఒక ముసలి రైతు పెహెల్‌గాం వెళుతూ కనిపించాడు. ఆ పెద్ద మనిషితో స్నేహం కలుపుకుంటే తనకు సాయపడగలడని హుస్సేన్ ఆశించాడు. అతని వెంట నడవడం ప్రారంభించాడు. మధ్యాహ్నానికి ఎండ తీవ్రం కావడంతో ఇద్దరూ బాగా అలిసిపోయారు.

"ఈ ప్రయాణంలో మనం ఒకరికొకరు మార్చి మార్చి మోసుకుంటూ వెళితే హాయిగా ఉంటుంది కదా?" అని అడిగాడు హుస్సేన్.

"ఒకరినొకరు మోసుకు వెళ్ళడమా? ఆ మాటల్లోని భావం ఏమైవుంటుందా?" అని ఆశ్చర్యపోయాడు రెహ్మాన్.

ఆ సమయంలో వాళ్ళు కోతకు సిద్ధంగా ఉన్న జొన్నపంట పొలం గట్టు వెంట నడుస్తున్నారు. "పొలంలోని జొన్నలు తినేసినవా? మిగిలి ఉన్నవా?" అని అడిగాడు హుస్సేన్.

రెహ్మాన్‌కు ఆ ప్రశ్న అసలు అంతుబట్టలేదు. "నాకు తెలియదు..." అన్నాడు.

ఆరోజు సాయంకాలానికి ఆ ఇద్దరు ప్రయాణీకులూ ఒకగ్రామం చేరుకున్నారు. వాళ్ళొక మసీదులోకి వెళుతూ ఉంటే ఎవరూ సలాం చేయలేదు; రమ్మని పిలవలేదు. "ఈ శ్మశానంలో మనం ఏం చేస్తున్నాం?" అని అడిగాడు హుస్సేన్ ఆశ్చర్యంతో.

"ఇక్కడ ఉన్న మనుషులు నీకు కనిపించడంలేదా? ఇది శ్మశానం కాదు," అన్నాడు రెహ్మాన్.

వాళ్ళు అక్కడి నుంచి బయటకు వచ్చి, కొంతదూరం వెళ్ళాక శ్మశానవాటికలో, కొందరు మనుషులు చనిపోయిన తమవాళ్ళ జ్ఞాపక



చిహ్నంగా డమ్‌గోష్ట్, కుల్చాన్ అనే మధుర పదార్థాలు పంచుతూ ఉండడం కనిపించింది. "ఆహా! ఎంత అద్భుత నగరం!" అంటూ మురిసిపోతూ వాటిని తీసుకుని తిన్నాడు హుస్సేన్.

రెహ్మాన్, "ఏమిటీ పిచ్చిమనిషి? మట్టి బెడ్డను నీళ్ళు అనీ, నీళ్ళను మట్టిబెడ్డ అనీ అనగల సమర్థుడు," అని మనసులో అనుకున్నాడుగాని, పైకి మాత్రం ఏమీ అనలేదు.

వాళ్ళు నగరం శివార్లకు చేరుకుని, రెహ్మాన్

## పర్యాటక ఆకర్షణ!



"గర్ బార్ రుయే జమీ అస్త్; హమీ అస్త్; హమీ అస్త్; హమీ అస్తో." 'ఈ భూమిమీద స్వర్గం అంటూ ఉంటే అది ఇదే, అది ఇదే, అది ఇదే ఇదే!' మొగల్ చక్రవర్తి షాజహాన్ ఢిల్లీలో నిర్మించిన ఎర్రకోట దివాన్-ఇ-ఆమ్ ఉపరి తలంలో ఈ పద్య పాదాలు చెక్కబడి ఉన్నాయి. కాశ్మీరును సందర్శించే పర్యాటకుల మనసుల్లో వీటిలోని భావం తప్పక కదలాడుతుంది.

అందమైన కాశ్మీరును ఎల్లప్పుడూ 'భూతల స్వర్గం'గా అభివర్ణిస్తారు. సరస్సులు, మంచు కప్పిన శిఖరాలతో పర్వతాలు, సుందరమైన లోయలు; రంగు రంగుల పుష్పాలతో కన్నుల పండువచేసే మైదానాలు.. ఇలా ఎన్నో సుందర దృశ్యాలు పర్యాటకులను ఎంతగానో ఆకర్షించి అలరిస్తాయి. జగత్ప్రసిద్ధిగాంచిన 'దాల్‌లేక్' అనే బ్రహ్మాండమైనసరస్సును, సర్‌వాల్టర్‌లారెన్స్ 'సాటి లేని సరస్సు' అని వర్ణించాడు. కాశ్మీరు కిరీటంలోని కలికితురాయిగా కూడా దానిని చెబుతారు. షికారాలకు, పడవఇళ్ళకు కూడా దాల్‌లేక్ ప్రసిద్ధిగాంచింది. ఒకస్థలంకన్నా మరొకస్థలం భిన్నంగా కని పిస్తూ, రోజంతాచూస్తూండగానేమారుతూన్నరంగులతో, దృశ్యాలతో కనిపించేదాల్‌లేక్‌పర్యాటకు లనుఆనుదాశ్చర్యాలతో ముంచెత్తుతాయి. ఈటాకాలగట్టులపై బ్రహ్మాండమైనఉద్యానవనాలుఉన్నాయి.

సాహసప్రియులైనపర్యాటకులు కొండవాలు ప్రాంతాలలో (ఇక్కడి నుంచే నదులు పుట్టి రాష్ట్రం గుండా ప్రవహిస్తున్నాయి.) ట్రెక్కింగ్, స్కయింగ్‌చేయవచ్చు. మిగిలినవారు షికారాలలో హాయిగా తిరిగి రావచ్చు.

ఇంటిని సమీపించారు. అప్పుడు రెహ్మాన్ "యువ మిత్రమా! నువ్వు ఇక్కడ ఉన్నంత వరకూ మా ఇంట్లోనే బసచేయవచ్చు," అన్నాడు ఆప్యా యంగా నవ్వుతూ.

"తమ దయకు కృతజ్ఞతలు! పొద్దుగూకేంత వరకు నేను ఇక్కడే ఉంటాను. మీఇంటివాసాలు దృఢమైనవేనా చెప్పు మరి," అన్నాడు హుస్సేన్.

యువకుడి మూర్ఖత్వాన్ని తలుచుకుని పగలబడినవ్వుకుంటూ హుస్సేన్ అక్కడి నుంచి బయలుదేరాడు.

ఇల్లు చేరగానే, ఆయన తనతో ప్రయాణం చేసిన వింత మనిషిని గురించీ, అతని విచిత్ర ప్రశ్నల గురించీ, తన కూతురు జోహ్రాకు వివ రించి, "ఆ యువకుణ్ణి మన ఇంటికి పిలిస్తే, మన ఇంటి వాసాల గురించి ఆరా తీస్తున్నాడు, వెర్రివాడు!" అన్నాడు.



"అయినా, ఆ యువకుడు చాలా తెలివి గలవాడని అనిపిస్తోంది, నాన్నా!" అన్నది జోహ్రా.

"ఆ సంగతి నువ్వెలా చెప్పగలవు? అతడు అడిగిన ప్రశ్నలన్నీ అర్థం పర్థం లేనివే!" అన్నాడు రెహ్మాన్.

"కాదు, నాన్నా! ఆయనవాసాలను గురించి అడిగినప్పుడు, ఆయన్ను భరించే స్థోమత మనకు ఉందా అని తెలుసుకోగోరాడు, అంతే," అన్నది జోహ్రా.

కూతురి జవాబుతో రెహ్మాన్ కాస్త మెత్త బడ్డాడు. 'బహుశా ఈమె హుస్సేన్ ఇతర ప్రశ్నలకూ, అభిప్రాయాలకూ కూడా సరైన వివరణ ఇవ్వగలదేమో!ఎవరికితెలుసు?అడిగిచూద్దాం!' అనుకున్నాడు.

"అదిసరే తల్లీ! మరి, ఒకరినొకరు మార్చి మార్చి మోసుకువెళ్ళడం మాటేమిటి?" అని అడిగాడు రెహ్మాన్.

"ఇద్దరిలో ఒకరు కథలు చెప్పడమనేది అందులోని భావం. కథలుచెప్పుకుంటూ నడిస్తే మార్గాయాసం తెలియదు. అలాంటప్పుడు కథలు చెప్పేవారు మరొకరిని మోసుకు వెళ్ళి నట్టే కదా మరి!" అంటూ వివరించింది జోహ్రా.

"రెండవ ప్రశ్న; తినేసిన జొన్నలు అంటేఏమిటి?" అని అడిగాడు రెహ్మాన్.

జోహ్రా గట్టిగా నవ్వి, "మీరూ ఒక రైతుగా ఉండికూడా అదేమిటో గ్రహించలేదా? రైతులు సక్రమంగా పన్నులు చెల్లించకపోతే అధికారులు వచ్చి జరిమానాగా ధాన్యాన్ని తీసుకువెళతారు. అలాంటప్పుడు రైతుకు అది తినేసిన ధాన్యం కాక మరేమిటి?" అని అడిగింది.

"అది సరే, మరి అతను మసీదును శ్మశానం గానూ, శ్మశానాన్నీ నగరంగానూ ఎందుకు అన్నాడు?" అని అడిగాడు రెహ్మాన్.

"దయ, కరుణ కలిగిన మనుషులు నివసించే ప్రదేశమే నగరం అని ఆయన అభిప్రాయం. అలాంటివాళ్ళు లేనిచోటు జనంతో కిటకిటలాడినా శ్మశాన సదృశమే.

## స్థలపురాణం

కాశ్మీరు లోయంతా ఒకప్పుడు సముద్రం లాంటి పెద్ద సరస్సుతో నిండి ఉండేదట. అందులోకి ఒక జలరాక్షసుడు చేరి, చుట్టుపక్కల నానా బీభత్సం సృష్టించాడట. బ్రహ్మ మనుమడైన కశ్యపుడి ప్రయత్న ఫలితంగా జలాశయంలోని నీళ్ళన్నీ ఇంకిపోయాయి. పార్వతీదేవి రాక్షసుడిమీద ఒక కొండను ప్రయోగించి హతమార్చింది. పార్వతీదేవి విసిరిన కొండ మరేదో కాదు. ఈనాటికీ శ్రీనగర్‌కు నేపథ్యంగా ఉంటూన్న 'హరి పర్వత్' కొండే అని చెబుతారు!

మసీదులో ప్రజలు దయాదాక్షిణ్యాలు, సలాం లాంటి ఆహ్వానం లేకుండా ప్రవర్తించారు. అయితే శ్మశానంలో దానికి విరుద్ధమైన దృశ్యం ఎదురయ్యింది. అందుకే ఆయన మసీదును శ్మశానమనీ, శ్మశానాన్ని నగరమనీ చెప్పాడు,'' అని జోహ్రా తండ్రికి వివరించింది.

"నీ వివరణలు చూస్తూంటే అతడు తెలివి గల యువకుడిలాగే కనిపిస్తున్నాడు!'' అన్నాడు తండ్రి.

ఆ తరవాత హుస్సేన్ ఎప్పుడు వస్తాడా అని జోహ్రా ఎదురుచూడసాగింది. ఆఖరికి అతడు చెప్పినట్టు భోజనానికి రానేవచ్చాడు.

"మీరు ఎవరు? ఇంతదూరం ఎందుకు వచ్చారో తెలుసుకోవచ్చా?'' అని అడిగింది జోహ్రా.

హుస్సేన్ ఆమెకు, నవ్విన వింతచేపగురించీ, రాజుగారి హెచ్చరికగురించీ వివరంగా చెప్పాడు.

"అలాగా! ఆ ప్రశ్నకు జవాబు చాలా సులభం. రాజును హతమార్చడానికి, రాజ భవనంలో ఎవరో పథకం వేస్తున్నారు, అన్నదే చేప నవ్వులోని ఆంతర్యం,'' అన్నది జోహ్రా.



ఆమె చెప్పింది నిజమే అని హుస్సేన్ గ్రహించాడు. ఆమెనూ, ఆమె తండ్రినీ వెంట బెట్టుకొని రాజధానికి తిరిగి వెళ్ళాడు. రాజ దంపతులను దర్శించి, రాజుకు సలాం చేసి, "జహాపనా! మేము ఒక రహస్య సందేశాన్ని

## హస్తకళలు



కాశ్మీరు తివాసీలకు పేరుగాంచింది. వాటిని చేత్తో నేస్తారు. నేతకు ఉన్ని, పట్టు దారాలను ఉపయోగిస్తారు. తరవాత మృదుమైన రంగులు గల అల్లికలతో వాటిని అలంకరిస్తారు.

ఆ తరవాత చెప్పుకోతగినవి కాశ్మీరు శాలువాలు. పాపీర్ మేచీ వస్తువులు, కంబళి, ఎంబ్రాయిడరీ, బుట్టలల్లడం, అక్రోటు కొయ్య చెక్కడం పనులు. కాశ్మీరీ శాలువలు, అందునా షాతూష్ శాలువలు, ఎంబ్రాయిడరీకీ, వెచ్చదనానికీ, మెత్తదనానికీ చాలా ప్రసిద్ధిగాంచాయి. వాటి నాణ్యతను చెబుతూ ఒక్కొక్క దాన్ని ఉంగరంద్వారా అవతలికి తీయవచ్చునని చెబుతారు! నశించిపోతూన్న షాతూష్ గొర్రెల కారణంగా, షాతూష్ శాలువాల తయారీని నిషేధించారు.

కనుగొన్నాము. జోహ్రా అనే ఈ యువతి మీకా విషయం వివరిస్తుంది!'' అన్నాడు.

''నవ్విన చేపకు భవిష్యజ్ఞానం ఉన్నది. కళ్ళకు కనిపించేవి కొన్ని నిజం కాకపోవచ్చు. ఒక్కొక్కసారి మనకళ్ళే మనల్ని మోసగిస్తాయి. ఆ సత్యం ఎరిగినందువల్లే–ఆడా,మగా చేపల ప్రస్తావన వచ్చినప్పుడు ఆ వింత చేప నవ్వింది. తమను హతమార్చడానికి, రాజభవనంలోకి స్త్రీవేషంలో ప్రవేశించిన పురుషుణ్ణి గురించి చేప తన నవ్వుద్వారా తమను హెచ్చరించింది!'' అని వివరించింది జోహ్రా.

''దానిని నువ్వు నిరూపించగలవా?'' అని అడిగింది రాణి.

''తప్పకుండా, మహారాణీ! అందుకు ఒక చిన్న పరీక్ష పెడదాం,'' అన్నాడు హుస్సేన్.

రాజభవనంలోని పరిచారికలను పరీక్షించడానికి రాజదంపతులు అంగీకరించారు.

హుస్సేన్‌సలహాప్రకారం ఒకలోతైన గోతిని తవ్వించారు. ఆ తరవాత, పరిచారికలలో ఒక్కొక్కరుగా ఆ గోతిని దాటాలని ఆజ్ఞాపించారు. ఒక్క పరిచారిక తప్ప ఎవ్వరూ ఆ గోతిని దాటలేకపోయారు. ఆ గోతిని సునాయాసంగా దాటిన ఒకే ఒక పరిచారిక మగవాడని త్వరలో తెలిసిపోయింది. విచారణ జరిపారు. ఆడవేషంలోనివాడే రాజుగారిని హతమార్చడానికి పథకం వేసి తగిన అవకాశం కోసం ఎదురుచూస్తున్నాడు!

రాజదంపతుల ఆనందానికి అవధులు లేకుండా పోయింది. తమ ప్రాణాలను కాపాడినందుకు హుస్సేన్‌నూ, జోహ్రానూ అభినందించి విలువైన కానుకలతో సత్కరించారు. హుస్సేన్, జోహ్రాల వివాహం వైభవంగా జరిగింది. తెలివైన తన కుమార్తెకు తగిన వరుడు లభించినందుకు రెహ్మాన్ చెప్పలేనంతగా ఆనందించాడు.

## ఖరీదైన వాసనద్రవ్యాలు

పరిమళానికీ వాసనకూ ప్రఖ్యాతిగాంచిన కుంకుమపువ్వును, వాసనద్రవ్యాలను కాశ్మీరులో విరివిగా పండిస్తారు. ముఖ్యంగా శ్రీనగర్ శివార్లలోని పాంపూర్‌లో వీటిని ఎక్కువగా పండిస్తారు. ప్రపంచం మొత్తం మీద స్పెయిన్ తరవాత ఇక్కడ మాత్రమే కుంకుమ పువ్వులు పైరవుతాయి. అవి సంవత్సరానికి ఒక్క నెలలో మాత్రమే పూస్తాయి. ఎండబెట్టిన ఈ ఎర్రటి పూలను ప్రపంచంలో అత్యంత ఖరీదయినవిగా చెబుతారు.

బాదం, అక్రోటు చెట్ల పెంపకానికి కాశ్మీరు వాతావరణం చాలా అనువైనది. రాష్ట్రంలో అవి విస్తారంగా కనిపిస్తాయి.





# అప్పిచ్చువాడు!

గణపతి తెలివైనవాడని పేరు. అతడికి వున్న ట్లుండి వెయ్యిరూపాయలు కావాల్సివచ్చాయి. పొరుగూళ్ళో తన మిత్రుడు చలపతి తప్పక ఆదుకుంటాడన్న నమ్మకంతో, అతడు అక్కడికి బయల్దేరి వెళ్ళాడు. దురదృష్టంకొద్దీ చలపతి అప్పటికే డబ్బు ఇబ్బందుల్లో వున్నాడు.

''మాది శ్రామికుల ఊరు. మీది ధనవం తుల ఊరు. ఇక్కడ నీకు డబ్బు ఇబ్బంది అంటే ఆశ్చర్యంగా వుంది. ఈ ఊళ్ళో అప్పులిచ్చే నాధుడే లేడా?'' అని అడిగాడు గణపతి నిరు త్సాహంగా.

చలపతి కూడా నిరుత్సాహపడిపోయి, ''ఎందుకు లేరూ? ఇక్కడ దివాకరుడికి దాన కర్ణుడన్న పేరుంది. కానీ వాడు మహాతలతిక్క మనిషి. ఎవరితోనూ కలవడు. పదిమందిలోకీ రాడు. ఒక్కొక్కసారి పదివేల రూపాయలుకూడా దానంగా ఇవ్వగలడు. ఒకోసారి రెండే రెండు వందలు అప్పుగా ఇవ్వమన్నా లేదంటాడు. వాడినర్థం చేసుకోవడం కష్టం!'' అన్నాడు.

పదివేల రూపాయలు దానంగా ఇవ్వగల వాడు , రెండువందలు అప్పుగా ఇవ్వనంటా డంటే, గణపతికి ఆశ్చర్యంవేసింది. ఎవరెవరికి ఎప్పుడెప్పుడు దివాకరుడు అప్పులిచ్చాడో, ఎవరెవరికి ఎప్పుడెప్పుడు లేదన్నాడో అతడు, చలపతిని అడిగి తెలుసుకున్నాడు.

''ఈ వివరాలన్నీ నీకెందుకూ?'' అన్నాడు చలపతి అన్నీ చెప్పాక.

''ప్రతి మనిషి ప్రవర్తనకూ ఏదో కారణ ముంటుంది. మనం బాగా ఆలోచిస్తే చిక్కు ముడి విప్పడం కష్టం కాదు. నా అభిప్రాయంలో దివాకరుడు తలతిక్కమనిషి కాదు. నేనొక సారి వెళ్ళి ఆయనను కలుసుకుని వస్తాను,'' అంటూ గణపతి అక్కణ్ణించి బయల్దేరి దివా కరుడింటికి వెళ్ళాడు.

ఆ సమయానికి దివాకరుడు తన ఇంటి పెరట్లోని పూలతోటలో వున్నాడు. ఆయనకు తోటపని అంటే చాలా ఇష్టం. అక్కడ ఆయన అపూర్వమైన పూలమొక్కలను సేకరించి పెంచు

''వసుంధర''

తూంటాడు. గణపతి ఆయనను సరాసరి పూలతోటలోనే కలుసుకుని, ఆయన అభి రుచులను అదేపనిగా కొంతసేపు మెచ్చు కుని ఉబ్బేసి, అప్పుడు తన పరిచయం చేసు కున్నాడు.

"నువ్వు మా చలపతి మిత్రుడివా? వాడు నాకెంతో కావలసినవాడు. పొరుగూరువాడివి నిన్ను పంపి తను రాలేదేమిటి?" అన్నాడు దివాకరుడు వెంటనే.

"నేను ఒకతరహా నల్లగులాబుల కోసం వెతుకుతున్నాను. అవి నీ తోటలో ఉంటా యని తెలియగానే, ఇలా పరుగెత్తుకొచ్చాను. అదిగో, ఆ కనిపిస్తున్న నల్లగులాబీయే నేను వెతుకుతున్నది!" అంటూ గణపతి ఒక మొక్కను సమీపించాడు.

"ఆ నల్లగులాబిలోని ప్రత్యేకత ఏమిటి?" అన్నాడు దివాకరుడు ఆశ్చర్యంగా.

గణపతి ఆ పువ్వునే గుచ్చి గుచ్చి చూస్తూ, "ఈ పువ్వును వరుసగా పదిమంది పురుషులు అరచేతులతో తాకినతర్వాత నీళ్ళలో వేసి మరి గించి, ఆ నీటిని పురిసెడు పుచ్చుకుంటే కైలాస గిరిని దర్శించినంత పుణ్యంవస్తుందంటారు!" అన్నాడు గణపతి.

దివాకరుడు అప్పటికప్పుడు పంచాంగం చూసి, శుభఘడియలు వచ్చి చాలాసేపే అయిందని నిర్ణయించాడు.

"అయితే మన అదృష్టం పండింది! నువ్వు చుట్టుపక్కలవారిని ఏడుగురు పురుషుల్ని పిలువు. ఈ లోగా నేను చలపతిని వెంట బెట్టుకుని వస్తాను. నీతో కలిసి పదిమందిమి



అవుతాము. మనందరకూ పుణ్యయోగం పట్టబోతున్నది!'' అన్నాడు గణపతి.

దివాకరుడు సరేనని ఏడుగురుని పిలుచుకు వచ్చాడు.

కాసేపటికి అక్కడి నల్లగులాబీని నీళ్ళలో మరిగించి, పదిమంది పురుషులేకాక, దివాకరుడి ఇంటిలోని స్త్రీలు, పిల్లలుకూడా తాగి ఎంతో సంతోషించారు. అందరూ ఎంతో ఉత్సాహంగా ఉన్న ఆ సమయంలో, గణపతి నెమ్మదిగా చలపతి చెవిలో, ''ఇప్పుడు దివాకరుణ్ణి అయిదువేల రూపాయలు అప్పడుగు. ఒక వెయ్యి నాకిచ్చి, మిగతావి నువ్వుంచుకో. అనుమానించకు; ఆయన తప్పక అప్పు ఇస్తాడు. ఇవ్వకపోతే నేను నీకు పదివేల రూపాయలు బాకీవున్నట్టు, తెలిసిందా!''అని చెప్పాడు.

తటపటాయిస్తూనే చలపతి, దివాకరుణ్ణి సమీపించి తన అవసరం చెప్పుకున్నాడు.

''అప్పడుగుతూ దానం పుచ్చుకునేవాడిలా మొహమాట పడతావేమిటి? నువ్వు నాకెంతో కావలసినవాడివి. అయిదువేలు కాకపోతే పదివేలు తీసుకో,'' అన్నాడు దివాకరుడు.

''పది వద్దు, అయిదు చాల్లే,'' అని చలపతి ఆయనవద్ద అప్పుతీసుకున్నాడు.

గణపతితో కలిసి ఇంటికి వెళ్ళాక, అతడికి వెయ్యిరూపాయలనిచ్చిన చలపతి, ''గణపతీ, నువ్వడగమన్నావనిఅడిగాను కానీ, దివాకరుడి చేత లేదనిపించుకోవాల్సి వస్తుందని మనసులో తెగ మథనపడిపోయాను. వాడు అప్పిస్తాడని అంత ఖచ్చితంగా ఎలా చెప్పగలిగావో చెప్పు!'' అన్నాడు.

''దివాకరుడికి గుర్తింపు కావాలి. నలుగురిలో అడిగినప్పుడు ఆయన్నేమడిగినా ఇస్తాడు, అంతా దానకర్ణుడంటారని. ఒక్కడూ ఉన్నప్పుడడిగితే పైసాకూడా విడవడు. ఎవరూ చూడ్డం లేదు కాబట్టి! ఆయన్నడిగి లేదనిపించుకున్న వాళ్ళందరూ, ఒంటరిగావుండగా అడిగినవాళ్ళే! అయితే, దివాకరుడు డబ్బు జాగ్రత్త మనిషి. నలుగురిలో ఉండగా లేదనడం ఇష్టంలేక, అలాగని ఇవ్వడమూ ఇష్టంలేక, ఆయన ఒంటరిగా వుండడానికే ఇష్టపడతాడు. ఇది గ్రహించిననేను, ఆయనకు అనుమానం రాని విధంగా, ఆయన చుట్టూ పదిమందిని చేర్చి, అప్పుడు నీచేత అప్పు అడిగించాను,'' అన్నాడు గణపతి.

మిత్రుడి తెలివితేటలకు చలపతి,''ఔరా!'' అంటూ ముక్కున వేలేసుకున్నాడు.





# విఘ్నేశ్వరుడు

"విఘ్నేశ్వరా! ఇప్పుడు నీవు చేసిన గజాసుర నిర్మూలన జ్ఞాపకంగా గణపతి నవరాత్రి ఉత్సవాలు కలకాలం ఘనంగా జరుగుతూం టాయి. ముందుకాలంలో ప్రజల స్వేచ్ఛ, శ్రేయస్సుల కోసం సాగే ఉద్యమాలు గణేశ ఉత్సవాలతో జయప్రదంగా కొనసాగి ఫలి స్తాయి. భూలోకంలో వైభంగా జరిగే ఉత్స వాలన్నిటికీ గణపతి నవరాత్రి ఉత్సవం తిలకంగా ఉంటుంది!" అని ఆకాశవాణి పలికింది.

విష్ణువు విఘ్నేశ్వరుడితో, "పార్వతీనందనా! మేనల్లుడివని చెప్పి నాకు మరొకపని కూడా కల్పించావా!" అన్నాడు.

విఘ్నేశ్వరుడు, "మేనమామ వరసపెట్టి కాలనేమి అయిన కంసుణ్ణి మేనమామ గండాన నువ్వెలాగూ పుట్టి, చంపుతావుగదా! ఇలాంటి వరసలన్నీ నీవు నేర్పిన విద్యలేగదా నీరజాక్ష!" అన్నాడు.

విష్ణువు, "విఘ్నవినాశకా! నీ పరశువు ముందు, నా చక్రాయుధం ఏపాటి? నీ గొడ్డలి సాము చూసినప్పుడు మహాముచ్చటేసింది సుమా!" అన్నాడు.

"పరశురామావతారంలో నా గొడ్డలి ఎరువు తీసుకెళ్ళి గర్వపోతులైన క్షత్రియుల్ని తెగ నరుకుదువుగానిలే!" అన్నాడు విఘ్నేశ్వరుడు.

విష్ణువు, "గజవిఘ్నాసురుడి మీద ఎక్కి మర్దిస్తున్నప్పుడు నీ బుడిబుడి నడకల గుజ్జు రూపం కూడా నన్నెంతో మురిపించిందోయి!" అన్నాడు.

"అలాగైతే, వామనుడివై బలిచక్రవర్తిని పాతాళానికి అణగదొక్కుదువుగానిలే!" అని విఘ్నేశ్వరుడు అన్నాడు.

## 6. కుమారస్వామి జననం



''నీ బుద్ధి విశేషం కూడా నన్ను అమితంగా ఆకర్షించుతోంది, ఏంచెయ్యను,'' అని విష్ణువు అనగా, విఘ్నేశ్వరుడు, ''యుగానికి అవసరమైన ధర్మాన్ని ఆ యుగంలో స్థాపించడమే గదా, నీ అవతారాలకు మూలకారణం! ధర్మ సంస్థాపనకు, అసలుఅర్థం, సంఘం హింసతో, మూఢాచారాలతో కుళ్ళిపోతున్న రోజుల్లో బుద్ధుడవై అవతరించి మానవులకు సక్రమ సంఘజీవనాన్ని, నిర్వాణాన్ని బోధించుతావులే! మాయాదేవి స్వప్నంలో నా తెల్లని ఏనుగు రూపం గర్భంలో ప్రవేశించి బుద్ధుడైన సిద్ధార్థుడి అవతారానికి నాంది పలుకుతుంది!'' అని చెప్పాడు.

ఆ మాటలకు విష్ణువు మహదానందం పొందాడు.

పరమాణు రూపంలో ఉన్న విఘ్నం నమస్కరించి, ''విఘ్నరాజా, నీ భానిసను, నీ ఆజ్ఞానువర్తిని, వెళుతున్నాను,'' అని శలవు తీసుకొని కాళింది మడుగుచేరి కాళీయుడుగా దాక్కుంది.

విఘ్నంవెనకనే మూషికాసురుడు మూషిక రూపంతో వచ్చి ప్రచ్ఛన్నంగా దాగి, విఘ్నానికి పట్టినగతి చూసి పటపట పళ్ళుకొరికి, నిజ రూపంతో బోర విరుచుకొని విఘ్నేశ్వరుడి ముందు నిలబడి దిక్కులు అదిరేలా సింహనాదం చేశాడు.

విఘ్నేశ్వరుడు బలిష్ఠమైన అతని శరీరాన్ని సంతృప్తిగా చూశాడు. మూషికాసురుడు నిర్లక్ష్యంగా విషపునవ్వు నవ్వుతూ, ''విఘ్నం నీ బానిస కనుక ఏంచేసినా చేశావుగాని, నేను నీ జన్మవిరోధిని. సింహస్వప్నం అనేమాట వినే ఉంటావే, సింహాన్నై నీ కుంభస్థలాన్ని చీలుస్తాను!'' అని అంటూ సింహంగా మారి పెద్దగా గర్జించాడు.

విఘ్నేశ్వరుడు, ''సింహమా! నువ్వు జగజ్జనని వాహనానివి, నిన్ను గౌరవిస్తున్నాను!'' అన్నాడు.

సింహం మళ్ళీ గర్జించి ఉరకబోతూంటే, విఘ్నేశుడు, ''శివా, శరభా!'' అని స్మరించాడు.

సింహానికి ఎదురుగా శివుని శరభావతారం ఘీంకార గర్జనలుచేస్తూ నిలిచింది. శరభానికి సింహశరీరము, కేసరాలు, కోరలు ఉంటూ ఏనుగు తొండమూ, దంతాలు ఉన్నాయి. మహాసర్పం లాంటి తోకచివర జ్వాలలు కక్కే మకర ముఖము ఉంది. శరభం జూలు అగ్ని శిఖల్లాగా ఎగురుతున్నాయి. శరభం తొండంతో సింహం ముఖం వాచేలా కొట్టింది. సింహం తోకముడిచి పరుగుతీసింది. శరభావతారం మాయమైంది.

విఘ్నేశ్వరుడు తొండాన్ని యోజనం పొడవున సాగదీసి సింహం నడుము చుట్టిపట్టి ఎత్తాడు. సింహం కిరకిరలాడింది. ఆ సమయంలో ఆకాశగమనం చేస్తున్న నారదుడు ఆనందంతో 'సా' అని గొంతు సాగదీస్తూ, "సామజ వరవదనా!" అంటూ హిందోళ రాగాన్ని ఆలాపించాడు.

దేవతలు గుమిగూడి ఆకాశం నుండి వింత చూస్తున్నారు. విష్ణువు, "విజయ విఘ్నేశ్వరా! నువ్వు పట్టిన సింహాన్ని పెంచుకుంటాను, ఇవ్వవూ?" అన్నాడు.

విఘ్నేశ్వరుడు నవ్వి, "పెంచినట్టే పెంచి తలా, గోళ్ళూ తీసుకొని నరసింహావతారం ఎత్తి హిరణ్యకశ్యపుణ్ణి చీలుద్దామనా? అదేం కుదరదు. ఈ మృగరాజు అవసరం నాకు ఉంది, నీ నరసింహావతారం నీవు చూసుకోవలసిందే!" అన్నాడు.

తొండం మూషికాసుర సింహాన్ని తిన్నగా తీసుకెళ్ళి మహాశ్వేత ముందు విడిచి అదృశ్యమైంది. మహాశ్వేత భర్తకు హితవు చెప్పినా వినకుండా నిజరూపంతో విఘ్నేశ్వరుడితో ఢీకొనడానికి పరుగుతీశాడు. మహాశ్వేత దేవిని ప్రార్థించింది. దేవి కనిపించి, "నీ భర్త విఘ్నేశ్వరుడికి ఎలుక వాహనంగా చిరంజీవిగా ఉంటాడు. అలా రాసిపెట్టి వుంది. నీవు కూడా శ్వేతఛత్రానివై నీ భర్తతోబాటు కలకాలం విఘ్నేశ్వరుణ్ణి సేవిస్తూ ఉంటావు!" అని చెప్పి అంతర్ధానమైంది.

వజ్రదంతుడు కామరూపి గనుక, ఈసారి ఏనుగుల్ని తన్నుకుపోగల గండభేరుండపక్షి రూపంతో, దారిలో కనిపించినరెండు ఏనుగుల్ని గోళ్ళతో పట్టుకుని ఎగిరి వెళ్తూండగా చెలరేగిన



అలజడికి, చిన్నగ్రద్ద రూపంతో ఒక చెట్టుమీద హరిని ధ్యానిస్తూ ఉన్న గరుత్మంతుడికి ధ్యానభంగమైంది. కోపంతో గ్రద్ద గండభేరుండాన్ని ముక్కుతో పొడిచింది. ఆ పోటుకు వజ్రదంతుడు నేలకూలాడు.

గరుత్మంతుడు, "ఇంతకంటె రుచికరమైన ములుకుపోట్లు తినబోతున్నావు, వెళ్ళు!" అంటూ ఎగిరిపోయాడు.

మూషికాసురుడు వెళ్ళి విఘ్నేశ్వరుడితో, "నీకూ ఉన్నాయి, పెద్దదంతాలు, వెలక్కాయలు నొక్కి తినడానికి తప్ప మరెందుకూ పనికిరావు. నా దంష్ట్రలతో వజ్రాల్ని పిండి చేస్తాను. కైలాసాన్ని గుల్ల చేస్తాను, తెలుసునా!" అన్నాడు.

వినాయకుడు ఆ మాటలు విని దిక్కులు చూస్తూ, తనలో తాను గొణుక్కుంటూన్నట్లుగా, "ఔనౌను, ఎందుకూ కొరగాని దంతాలు



ఉండి ఎందుకూ?" అంటూ ఒక దంతాన్ని పటుక్కున సగానికి విరిచి, పారేసినట్టుగా దూరంగా విసిరేశాడు.

ఆ దంతం గాలిలో గిర్రున తిరుగుతూ ఇంద్రజాలం ప్రదర్శించి వెళ్ళి వజ్రదంతుణ్ణి గుచ్చిగుచ్చి పొడవడం ప్రారంభించింది. రక్తం ధారలుకట్టి కారసాగింది. మహాశ్వేత అది చూడలేక మూర్ఛపోయింది. వజ్రదంతుడు చిన్న ఎలుకగా మారి తుర్రున పారిపోయి రాళ్ళ మధ్య కలుగు చేసుకొని దూరాడు. ఒక దంతాన్ని విరుచుకొని విఘ్నేశ్వరుడు ఏక దంతుడు అనిపించుకున్నాడు.

దంతం కూడా కలుగులో దూరి ఎలుకను అలా పొడుస్తూనే వెంబడించింది. తోకవెంట రక్తం జాడకడుతుంటే ఎలుక సొరంగం దొల్చుకుంటూ పాతాళానికీ, పాతాళం నుంచి భూమ్మీదకూ వచ్చి పరుగులుతీసి లోక మంతా చుట్టి చివరకు విఘ్నేశ్వరుడి శరణు జొచ్చి, "నాకా చావురాదు. నీ దంతం గుచ్చి గుచ్చి చంపుతున్నది, బాధ తప్పించు దేవా!" అని వేడుకున్న మూషికాసురుడికి విఘ్నేశ్వ రుడు అభయం ఇచ్చాడు. దంతం వచ్చి అతనిహస్తం అలంకరించింది.

విఘ్నేశ్వరుడు, "మూషికా! చూట్టానికి చిట్టెలుకవే గాని మహాబలుడివి. మహా కూర్మావతారంతో మంధరపర్వతాన్నీ, ఆది వరాహావతారంతో భూమినీ ఎత్తిన విష్ణువు కంటె బలశాలివి! తగిన వాహనం కుదరక నేను నా లంబోదరంతో నడవలేక అవస్థపడు తున్నాను. నీలాంటి..." అంటూ చెప్పడానికి సందేహిస్తున్నట్టు నసిగాడు.

విఘ్నేశ్వరుడి పొగడ్తకు మూషికాసురుడు పొంగిపోయి, "స్వామీ! నీ దంతం నాలోని అజ్ఞానాన్ని పారదోలి గుచ్చి గుచ్చి జ్ఞానాన్ని నింపింది. నీకు వాహనం కావడం నాభాగ్యంగా భావిస్తున్నాను," అంటూ ఏనుగంత ఎలుకగా పెరిగాడు.

విఘ్నేశ్వరుడు దానిపై కాలుమోపి కూర్చో బోగా మహామూషికం కీచుకీచుమంటూ అణుక్కుపోయింది.

విఘ్నేశ్వరుడుమందహాసం చేసి, "నాయనా మూషికా, నీవు చిట్టెలుకగా ఉంటేనే నన్ను సునాయాసంగా మోయగలవు. నా ఆకారా నికి చిట్టెలుక వాహనమే అన్నివిధాలా అమరు తుంది," అన్నాడు.

మూషికాసురుడు యథాప్రకారంగా చిట్టెలుకగా తగ్గిపోయాడు. విఘ్నేశ్వరుణ్ణి ఎక్కించుకొని చకచకా తిరుగుతూ, "ఔను



స్వామీ! ఇప్పుడు నిన్ను మోస్తున్నట్టే లేదు!'' అన్నాడు.

మూర్ఛనుండి తేరుకున్న ధవళ, విఘ్నేశ్వరుడికి నమస్కరించి, ''దేవా! నా భర్త నీకు చిట్టెలుక వాహనంగా ఉంటాడు, నేనుకూడా నీకు శ్వేతఛత్రమై ఉంటాను. ఈ వరం అనుగ్రహించు,'' అన్నది.

విఘ్నేశ్వరుడు, ''అమ్మా! నీ తెల్లని గొడుగు చల్లని నీడ నాకు రక్ష! నా భాగ్యం కొద్దీ దొరికింది,'' అంటూ ఎలుకను చూసి, ''వజ్రదంతా, దేవి అనుగ్రహం పొందిన సాధ్వి ధవళ మాటకు తిరుగులేదు. నా వాహనంగా ఉండు, నాతో బాటే నాకు పెట్టేవన్నీ, నువ్వూ హాయిగా తిను! అందరూ మొట్టికాయలు పెట్టుకొని, మూడు గుంజీలు తీసి లెంపలేసుకుంటూంటే, చాలా సంతోషంగా తృప్తిగా ఉంటుంది. నా ముందు, నీ ముందు కూడా అలాగే అంతా చేస్తూంటారు!''అన్నాడు.

''ఔను దేవా! నేనూ అలాగే కోరదామను కున్నాను. నేను వజ్రదంతుడిగా నా ముందర దేవతల చేత అలాగే చేయిస్తూండేవాణ్ణి. నీ వాహనాన్నై కృతార్థుడినయ్యాను!'' అని మూషికుడు అన్నాడు.

ధవళ తెల్లని గొడుగుగా విఘ్నేశ్వరుడిపై నిలిచింది. ఆ దంపతులు చిరంజీవులై వినాయకుణ్ణి అలాగే సేవిస్తూ ఉంటారు. విఘ్నేశ్వరుడు మూషిక వాహనుడయ్యాడు.

విష్ణువు విఘ్నేశ్వరుడితో, ''ఏకదంతా! మూషికోత్తమవాహనా! నీ వాహనం చూస్తే నాకు అసూయగా ఉందోయి. ఎంత మంచి వాహనాన్ని సంపాదించావు!!,'' అన్నాడు.

విఘ్నేశ్వరుడు, ''నీ కల్కి అవతారంలో నా వాహనం నీకు తెల్లని గుర్రమై అంతరిక్షాన్ని దాటి గ్రహాంతరాలకు తీసుకెళ్తుందిలే! మానవులకు కొత్త వలస రాజ్యాలను సమకూర్చు!'' అన్నాడు.

విష్ణువు, "ఆహాహా! నీ నోటిచలవ వల్ల అలాగే జరగాలి!" అని ఆనందించాడు.

నారదుడు, "విజయవిఘ్నేశ్వరా! ఇప్ప టికి నీతోబాటే విష్ణువు తొమ్మిది అవతారాలు తెలిశాయి, ఒక్కటి మిగిలింది!" అన్నాడు.

విష్ణువు నారదుణ్ణి చూసి కన్నుగీటి, "త్వర లోనే ఆ కళ్యాణ ఘడియ వచ్చినప్పుడు అదీ తెలుస్తుందిలే! మరీ అంత తొందరెందుకు," అన్నాడు.

"ఎవరి కళ్యాణం దేవా?" అని అడిగాడు నారదుడు.

"మన కళ్యాణ చక్రవర్తి విజయవిఘ్నేశ్వ రుడిదే!" అన్నాడు విష్ణువు.

విఘ్నేశ్వరుడు చిరుకోపంగా చూశాడు. "వెయ్యి విఘ్నాలు కల్పించుకోక తప్పదు!" అని గట్టిగా అనుకున్నాడు.

"నాయన్నాయన, అంతటితో సరిపెట్టు! వెయ్యి విఘ్నాలు పూర్తి అయ్యాక అరవిఘ్నం అయినా కల్పించుకోడానికి చెల్లేది లేదు సుమీ!" అని విష్ణువు హెచ్చరించాడు.

నారదుడు, "వెయ్యి విఘ్నాలనగా ఏమా త్రం? వెయ్యి విఘ్నాల తర్వాత విఘ్నేశ్వరుడి పెళ్ళి తప్పదు-తప్పదు! సరిసరి మాగరి, అని పాడుతూ ముల్లోకాలు తిరిగాడు.

శివుడికి పార్వతిపై గల మోహానురాగం తేజస్సుగా మారింది. అగ్నిదేవుడు దాన్ని తీసు కెళ్ళి శరవణ సరస్సు చేరేలాగ చేశాడు. ఆరు ముఖాలతో కుమారస్వామి అవతరించాడు. ఆరుగురు ఋషి భార్యలు అతణ్ణి పెంచి పార్వతీ పరమేశ్వరులకు అప్పగించారు. కుమారస్వామి పెరిగి పెద్దవాడయ్యాడు. గరు త్మంతుడు అతనికి నెమలి వాహనం ఇచ్చాడు. ఇంద్రుడు అతనికి ఎన్నోఆయుధాల్ని ఇచ్చాడు. పార్వతి శక్తిబల్లాన్ని ఇచ్చింది. కుమారస్వామి పెరిగి పెద్ద అవుతూంటే తారకాసురుడు తల్ల డిల్లిపోతూ భయంతో పీడకలలు కనసాగాడు.

కుమారస్వామి గొప్ప తపస్సు చేసి బ్రహ్మ జ్ఞానాన్ని విడమర్చి చెప్పి సుబ్రహ్మణ్యస్వామి అనిపించుకున్నాడు. ఓంకారం గురించిన నిగూఢ రహస్యాల్ని శివుడంతటివాడికే గురువై ఉపదేశించాడు. అన్నదమ్ములైన విఘ్నేశ్వ రుడు, కుమారస్వామి కైలాసంలో పార్వతీ శివుల కనులపండుగగా ఎంతో సఖ్యంగా ఆటపాటలతో విహరిస్తున్నారు.





# సావిత్రి తెలివి

భాగ్యమ్మకు, సూరయ్యతో పెళ్ళిజరిగి ఏడాది తిరక్కుండానే, వాళ్ళసంసారంలో గొడవలు ఆరంభమయ్యాయి. ఉదయం నిద్రలేచిన దగ్గరనుంచీ, రాత్రి పడుకునే వరకూ రోజూ ఏదో ఒక విషయంలో పోట్లాట జరిగేది.

ఉదయం దోసెలు చేయమని సూరయ్య అంటే ఇడ్లీలు చేసేది భాగ్యమ్మ . పండగకు తనపుట్టింటికివెళ్దామని భాగ్యమ్మ అంటే వద్దని తనచెల్లెలి ఊరికి తీసుకువెళ్ళేవాడు సూరయ్య. ముచ్చటపడి భాగ్యమ్మ పెంచుకుందామని పిల్లిని తెచ్చుకుంటే,దాన్ని తీసుకువెళ్ళి ఎవరింట్లోనో వదిలి, కుక్కపిల్లను తెచ్చాడు సూరయ్య.

ఒకనాడు భాగ్యమ్మ, కుక్కపిల్ల ఎంత కుయ్యో మొర్రో అంటున్నా దానికి ఆహారం పెట్టక, సమయానికి చేతిలోవున్న తెడ్డుతో దాన్ని కొట్టబోయింది. ఆ సమయంలో ఇంట్లో అడుగుపెట్టిన సూరయ్య అది చూసి కోపం పట్టలేక భార్య చేతిలోని తెడ్డు లాక్కుని, ఆమె వీపుమీద గట్టిగా కొట్టాడు.

భాగ్యమ్మ గావుకేకలు పెడుతూ, ఏడుస్తూ పక్కవీధిలోనేవున్న అన్న ధర్మయ్య ఇంటికి వెళ్ళింది. ఏం జరిగిందని ధర్మయ్య అడగ్గా, జరిగిందానికి చిలవలూ పలవలూ అల్లి, ఇక తాను సూరయ్యతో కాపరం చేయలేనని చెప్పింది.

ధర్మయ్య చాలా మృదుస్వభావంగలమనిషి. ఎవరికైనా కష్టంవస్తే ఆదుకోకుండా వుండలేడు. పైగా, అతడికి చెల్లెలంటే అమిత ప్రేమ.

"సరేలే, సూరయ్యతో నేను మాట్లాడతాను. అంతవరకూ నువ్విక్కడే వుండు," అన్నాడు ధర్మయ్య, భాగ్యమ్మతో.

మర్నాడు సూరయ్య వచ్చాడు. ధర్మయ్య అతణ్ణి కూర్చోబెట్టి హితవుచెప్పాడు. సంసారం అన్నాక ఇద్దరికీ సమానబాధ్యత వుంటుందనీ, ఒకరి ఇష్టాన్ని మరొకరు గౌరవించాలనీ అన్నాడు. చెప్పిందాని కంతకూ తల ఊపి సూరయ్య,

కోలపల్లి ఈశ్వర్



భాగ్యమ్మను తీసుకుని మౌనంగా ఇంటికి వెళ్ళిపోయాడు.

కానీ వారం తిరక్కుండానే భాగ్యమ్మ మళ్ళీ ధర్మయ్య దగ్గరకు వచ్చింది. భర్తలో ఏమాత్రం మార్పు రాలేదనీ, మరింతగా బాధిస్తున్నాడనీ చెప్పుకుని ఏడ్చింది. ఆ మర్నాడు మళ్ళీ సూరయ్య రావడం, ధర్మయ్య నచ్చజెప్పి, అతడితో భాగ్యమ్మను పంపించడం జరిగింది.

అయితే, ఈ వ్యవహారం అలా కొనసాగుతూనే వచ్చింది. నాలుగు రోజులకొకసారి ఇద్దరూ పోట్లాడుకోవడం, ధర్మయ్య సర్దిచెప్పి పంపడం పరిపాటి అయిపోయింది.

ధర్మయ్య ఇంటి చుట్టుపక్కల జనం భాగ్యమ్మనే కాకుండా, ధర్మయ్యను గురించి కూడా చులకనగా మాట్లాడుకోవడం మొదలు పెట్టారు. ఏం చెల్లెలో! ఏం అన్నయ్యో! అంటూ చిన్నగా నవ్వుకోసాగారు.

ఇదంతా గమనించిన ధర్మయ్య ఎంతో బాధపడ్డాడు. అతడు అదోలా విచారంగా వుండడం చూసి, ధర్మయ్యభార్య సావిత్రి కారణం అడిగింది. భాగ్యమ్మ విషయంలో ఏంచేయాలో అర్థంకావడంలేదన్నాడు, ధర్మయ్య. సావిత్రి నవ్వి, "ఏ సమస్యా పరిష్కారం కాకుండా వుండదు. మీరేం దిగులుపడకండి," అన్నది.

ఆ మరసటిరోజు మధ్యాహ్నం, యధా ప్రకారం ముక్కు చీదుకుంటూ, భర్తను శాపనార్థాలు పెడుతూ ధర్మయ్య ఇంటి గుమ్మంలో అడుగుపెట్టిన భాగ్యమ్మ, శిలాప్రతిమలా అలాగే నిలుచుండిపోయింది. ఇంటిలో వస్తువులన్నీ చెల్లాచెదురుగా పడివున్నాయి.

లోపలి గదిలో ధర్మయ్య పెద్ద గొంతుతో భార్య సావిత్రిని, "నీకు పిచ్చిపట్టి సామాను నాశనం చేస్తున్నావే!" అంటున్నాడు.

"అవునండీ, పిచ్చిదాన్నే. మిమ్మల్ని కట్టుకున్నాకే, నా బుద్ధి పనిచేయడం మానేసింది. మీది ఇలాంటి కుటుంబం అని తెలీక, మా అమ్మానాన్నలు నా గొంతు కోశారు!" ఉక్రోషంగా అన్నది సావిత్రి.

"ఆట్టే పేలకు! మాది పిచ్చివాళ్ళ కుటుంబమా?" అంటూ ధర్మయ్య రెట్టించాడు.

"ముమ్మాటికీ అంతే. మీకు పిచ్చి, మీ వాళ్ళందరికీ పిచ్చి," అన్నది సావిత్రి కీచు గొంతుతో. ఈ మాటలు విన్న భాగ్యమ్మకు ఎక్కడ లేని కోపం వచ్చింది. ఆమె సర్రున గదిలోకిపోయి, "ఏంటన్నయ్యా! వదిన అంత అవమానంగా మాట్లాడుతూంటే, వట్టి మాటలతో సరిపెడుతున్నావు," అన్నది.

ధర్మయ్య, భాగ్యమ్మను చూసి ముఖం చిట్లించుకుని, "చూడమ్మా! ఇది మా భార్యా

భర్తలకు సంబంధించిన విషయం. మామధ్య ఎన్నో ఉంటాయి. మధ్యలో నువ్వు కలుగ జేసుకోకూడదు,'' అన్నాడు.

భాగ్యమ్మ తెల్లబోయింది. వదిన ముందు తననిలా తీసిపారేయడం, ఆమెకు అవమానంగా తోచింది. ''అదేంటన్నయ్యా! వదిన మన కుటుంబాన్ని అంతలేసి మాటలంటూంటే...'' అని ఏదో చెప్పబోయింది.

అంతలో సావిత్రి కలగజేసుకుని, ''మధ్యలో నీ గొడవేంటమ్మా! అసలు నువ్వెవరు, మా విషయంలో తలదూర్చడానికి? కాపురం అన్నాక ఏవేవో సమస్యలొస్తుంటాయి. కోపంలో, చికాకులో భార్యాభర్తలు ఒకరినొకరు ఏదేదో అనుకుంటారు. తర్వాత ఏం జరగనట్టు కలిసిపోతారు. అయినా ఇవన్నీ నీకర్థంకావు కానీ, అసలు నువ్విక్కడికి వచ్చిన పనేమిటో చెప్పు,'' అన్నది.

భాగ్యమ్మ బిత్తరపోయింది. అసలు తను వచ్చిన సంగతి మరిచిపోయి, ఏదో ఒకటి అనాలి కాబట్టి, ''ఏం లేదు. అన్నయ్యను చూడ్డానికి వచ్చాను,'' అన్నది వాడిపోయిన మొహంతో.

ధర్మయ్య చిరాగ్గా మొహం పెట్టి, ''ఏంటమ్మా నన్ను చూసేది, పక్కవీధిలోనేగా వున్నావు! వారానికి రెండుసార్లన్నా వస్తున్నావాయె. సరేగానీ, ఇప్పుడు నువ్వొచ్చిన పనేమిటి?'' అన్నాడు కసురుతున్నట్టు.

అన్న మాటలు వింటూనే భాగ్యమ్మకు తల కొట్టేసినట్లయింది. ఇద్దరూ కలిసి తగవులాడుకుంటూనే, తనను చీదరించుకుంటున్నారు. తను భర్తతో పోట్లాడి వచ్చానని, తన కళ్ళ ముందు పోట్లాడుకుంటున్న అన్నావదినెలకు ఎలా చెప్పగలదు! అందుకని అసలు విషయం దాచి, ''మరేం లేదు, మేం



తిరుపతి వెళ్తున్నాం. మీరూ మాతో వస్తే బావుం టుందనుకున్నాం. ఆ సంగతి అడగడానికొస్తే, మీరిలా చిన్న పిల్లల్లా కొట్లాడుకుంటున్నారు. సరేలే! ఈసారికి మేమే వెళ్ళి వస్తాం,'' అంటూ విసురుగా వెళ్ళిపోయింది భాగ్యమ్మ.

అంత త్వరగా ఇంటికి తిరిగి వచ్చిన భార్యను చూసి, ఆశ్చర్యపోయాడు సూరయ్య. అన్నగారి ఇంటిదగ్గర ఏం జరిగిందో అతడికి అంతుబట్ట లేదు. ఏమైనా, భార్య త్వరగా ఇంటికి తిరిగి రావడం, అతడికి చాలా సంతోషం కలిగిం చింది. భాగ్యమ్మ ఏమీ జరగనట్టే, భర్తకు భోజనం వడ్డించింది.

ఆ రోజు రాత్రి ఉల్లాసంగా కనిపిస్తున్న సూరయ్యతో భాగ్యమ్మ ''ఏమండీ! మనకేదో శనిపీడ పట్టుకున్నట్టున్నది. అందువల్లే మన మధ్య చీటికీ మాటికీ గొడవలొస్తున్నాయి. ఒకసారి తిరుపతి వెళ్ళి దేవుణ్ణి దర్శించుకు వద్దాం!'' అన్నది.

సూరయ్య, భార్యలో వచ్చిన మార్పుకు ఎంతగానో ఆనందిస్తూ, ''సరే, అలాగే, నీ ఇష్ట ప్రకారం వెళదాం!'' అన్నాడు.

అన్నయ్యా, వదినెలు తనను అవమానించి నందుకు, తనుకూడా వాళ్ళకు తగినబుద్ధి చెప్పానని, భాగ్యమ్మ ఆనందపడింది. మర్నాడు ఆమె భర్తను వెంటబెట్టుకుని, ధర్మయ్య, సావిత్రులు చూస్తూండగా తిరుపతికి సంతో షంగా ప్రయాణమైంది.

హాయిగా అన్యోన్యంగావున్న, ఆ దంపతు లను చూసి, ధర్మయ్య తన భార్య తెలివిని ఎంతో మెచ్చుకున్నాడు. అతడు భార్యతో, ''సావిత్రీ! నువ్వు చెప్పిన ఉపాయం బహు చక్కగా పనిచేసింది. భాగ్యమ్మ, తన భర్తతో గొడవపడి మన ఇంటికి వచ్చిన సమయంలో, మనం పోట్లాడుకుంటూ వుండడం చూసి, నిజమేననుకున్నది! ఇలా చేద్దామని నువ్వి చ్చిన సలహావల్ల, ఒక కాపురంలో గొడవలు లేకుండా పోయినై,'' అన్నాడు.

సావిత్రి నవ్వుతూ, ''ఆలోచిస్తే ఏ సమస్య నైనా పరిష్కరించుకోవచ్చునని చెప్పానుకదా! ఇక మీ చెల్లెలు, వారానికి ఒకటి రెండుసార్లు వీధిన పడి మన ఇంటికి వస్తూ, నలుగురిలో నవ్వులపాలు కాదు, హాయి!'' అన్నది.



# చందమామ కబుర్లు

## ఒక భారతీయ రికార్డు!




ఒకప్పుడు మాంచెస్టర్ నగరం ఇంగ్లాండు పారిశ్రామిక రాజధానిగా పేరుగాంచింది. వస్త్ర, రబ్బరు పరిశ్రమలు రసాయనిక పదార్థాలు తయారుచేసే కర్మాగారాలు అంటూ జాబితా మొదలవుతుంది. ఇప్పుడు ఈ జాబితాకు ఊరగాయలు కూడా జత చేయవచ్చు. ఎందుకంటే భారతీయుల యాజమాన్యంలోని పాథక్ గ్రూపు ఇక్కడొక ఊరగాయల కర్మాగారాన్ని ప్రారంభించింది. దీనిని ప్రపంచంలోనే పెద్ద ఊరగాయల ఫ్యాక్టరీగా చెబుతున్నారు.ఒకదాని పక్కన ఒకటిగా ఆరు ఫుట్‌బాల్ గ్రౌండ్లు ఉన్నంత విస్తీర్ణంలో ఈ ఊరగాయల కర్మాగారం ఉంటోంది. యాభై ఏళ్ళక్రితం పాథక్ కుటుంబీకులు స్వగృహంలో సమోసాలు తయారుచేసి అమ్ముకుంటుండేవాళ్ళు. ఇప్పుడు ఎంత పైకి ఎదిగారో చూశారా?

## త్రాచుల అభయారణ్యం!

ఆంధ్రప్రదేశ్ విజయనగరం జిల్లా అన్నాభద్ర రిజర్వుడు అడవుల్లో త్వరలోనే 318 ఎకరాల విస్తీర్ణంలో త్రాచుపాముల (కింగ్ కోబ్రా) అభయారణ్యం ఏర్పాటు కానున్నది. ఇలాంటి అభయారణ్యం మనదేశంలో, బహుశా ప్రపంచంలోనే ఇదే మొట్టమొదటిది కావచ్చు. ఈ త్రాచుల అభిమాన ఆహారం చిన్న పాములు ఇక్కడ ఎక్కువగా ఉన్నాయి. ఈ త్రాచులను నశిస్తున్న పాముల జాతిగా ప్రకటించారు. ఇప్పుడు ఇక్కడ దాదాపు 20 త్రాచుపాములు ఉన్నాయి. అభయారణ్యం వీటికి తగిన రక్షణ కల్పిస్తుంది. ప్రపంచంలో చాలా పొడవైన విషపు నాగులుగా చెప్పబడే ఈ పాములు 12(4 మీ) అడుగుల పొడవు వరకూ పెరుగుతాయి.

# మెట్టవేదాంతి!

రాఘవాపురంలో, గురులింగయ్య పేరు తెలియనివారు లేరు. నూలు వ్యాపారంచేసే అతడికి సంపాదన చాలా ఎక్కువే. అయినా, డబ్బును తన అవసరాలకయ్యేడా ఆచితూచి మరీ ఖర్చుపెడుతూండేవాడు. అతి సామాన్యమైన నూలుదుస్తులు వేసుకుని, ఒక పెంకుటింట్లో భార్యా, ఇద్దరు కొడుకులతో కలిసి జీవిస్తూండేవాడు. తను సంపాదిస్తున్న డబ్బును ఎప్పటికప్పుడు ఇతరులను ఆదుకోవడానికి వినియోగిస్తూండేవాడు. అతణ్ణి అందరూ వింతగా చూసేవారు.

"ఏం లింగయ్యా! సంపాదనంతా వాళ్ళ వీళ్ళ కోసం ఖర్చుపెట్టేస్తున్నావు. అసలు నీకోసం ఏమైనా దాచుకుంటున్నావా లేదా?" అని మిత్రులూ, శ్రేయోభిలాషులూ తరచుగా అడుగుతూండేవాళ్ళు.

"నాకాబాధేమీ లేదయ్యా! నాక్కావలసినంత భూమి వుంది. ఇంకా దిగులెందుకూ?" అని బదులుచెప్పేవాడు గురులింగయ్య.

ఆయన ఇంట్లోవాళ్ళుకూడా, ఆయన చేసే ఖర్చులకు అడ్డు చెప్పకపోవడానికి కారణం ఎక్కడో కొంత భూమి కొని, ఆ సంగతి రహస్యంగా వుంచుతున్నాడనుకునేవాళ్ళు. కానీ, గ్రామపెద్ద సకలయ్య మాత్రం, "గురులింగయ్య ఏదో వేదాంతపుబాటలో వున్నాననుకుంటున్నాడని, నా అనుమానం. చూడబోతే, అతడి ధోరణి అంతా మెట్టవేదాంతంలా కనబడుతున్నది," అనేవాడు.

కొన్నాళ్ళకు గురులింగయ్య ఏదో విషజ్వరంతో హఠాత్తుగామరణించాడు. కొడుకులిద్దరూ గ్రామపెద్దను పిలిచి, తండ్రి ఆస్తిపాస్తుల గురించి వదిలిపోయిన కాయితాలకోసం, ఆయన సమక్షంలో పాతకాలపు భోషాణం తాళం తీసి చూశారు.

అక్కడ వాళ్ళకు, గురులింగయ్య రాసిన కాగితం ఒకటి కనిపించింది. అందులో--"నేను చనిపోయాక, నా శవాన్ని పాతిపెట్టడానికి శ్మశానంలో ఆరడుగుల భూమి ఉండనే వున్నది," అని వున్నది.

అది చూసి సకలయ్య, "ఆహా, నేననుమానించినట్టే గొప్ప మెట్టవేదాంతి!" అన్నాడు.

-కుమారి కుంతల









# చందా ఫారం

1. నేను చందా పంపుతున్నాను. నాకు కావలసిన చందమామ (✓ గుర్తు పెట్టండి)

☐ ఇంగ్లీష్ ☐ హిందీ ☐ మరాఠీ ☐ గుజరాతీ
☐ బెంగాలీ ☐ ఒరియా ☐ అస్సామీ ☐ తెలుగు
☐ కన్నడ ☐ తమిళం ☐ మలయాళం ☐ సంస్కృతం

2. నేను పంపుతున్నది (✓ గుర్తు పెట్టండి)

☐ ఇండియా లోపల చందా (స్వభాషా పత్రిక) రూ. 120 1 సంవత్సరం (12 సంచికలు)
☐ ఇండియా లోపల చందా (ఇంగ్లీష్ ఎడిషన్) రూ 180 1 సంవత్సరం (12 సంచికలు)
☐ విదేశాల చందా:INR 900, US $20 1 సంవత్సరం (12 సంచికలు (స్వభాష)
☐ విదేశాల చందా:INR1200, US $24 1 సంవత్సరం (12 సంచికలు) ఇంగ్లీష్

3. చందమామ చందా రూ. .................... డిమాండ్ డ్రాఫ్ట్/మని ఆర్డర్ ద్వారా...............
డి.డి.నం............ బ్యాంక్/స్థలం.............
చందమామ ఇండియా లిమిటెడ్ చెన్నయ్ పేరిట డి.డి. జతపరుస్తున్నాను.
(అవుట్ స్టేషన్ చెక్కులయితే రూ. 50 కలిపి పంపండి.)

4. కాపీలు పంపవలసిన పేరు & చిరునామా (విడివిడి అక్షరాలతో స్పష్టంగా రాయండి)

______________________________
______________________________
______________________________
______________________________

5. మీ చందాతోపాటు మీ మిత్రుల/బంధువుల పేరు,చిరునామా రాసి, వారికి **చందమామను** పరిచయం చేయవచ్చు.

______________ ______________
తేదీ సంతకం

ఈ చందా ఫారాన్ని మాకు పోస్ట్ చేయండి :
చందమామ ఇండియా లిమిటెడ్
82, డిఫెన్స్ ఆఫీసర్స్ కాలనీ, ఈకాట్టుత్తాంగల్
చెన్నయ్ - 600 097. ఇండియా
**Tel/Fax : 044 - 234 73 99 / 234 73 84**
**e-mail :chandamama@vsnl.com**
**Website : http://www.chandamama.org**

# అజేయుడు గరుడుడు

చిత్రాలు: పాణి




తాంత్రికుడు, తన గురువుకు సంతోషం కలిగించడానికి తాను స్త్రీ పురుషులను ఎలా బలి ఇస్తున్నదీ వివరించాడు.







తాంత్రికుడి మాటలు విని నరేంద్రదేవుడు దిగ్భ్రాంతి చెందాడు.
బహుశా ఆ అరవైయ్యో యువకుడి బలి, నీ రాజ్యంలో ఉన్న యువకుడు కావాలని నా గురుదేవుడి అభీష్టం కాబోలు!
ఆ యువకుడి దగ్గరికి నన్ను తీసుకుపో!..... హా!.. ఆ యువకుడి పేరు ఆదిత్యుడు. నా శత్రువు వాణ్ణే ఆవహించి ఉన్నాడు.
ఆదిత్యుడా?


ఆఖరికి నరేంద్రదేవుడి ముఖంలో చిన్న నవ్వు కదలాడింది.
ఇప్పుడు కదా అర్థమవుతోంది.. ఎవరు ఏమిటో?
అదే సమయంలో కొండ స్థావరాన్ని చేరు కున్న ఆదిత్యుడికి వీరబాహు, అరుణ స్వాగతం పలికారు.
మీ కోసమే ఎదురు చూస్తున్నాం!
మీరు రాజుగారిని వెంటనే దర్శించడం, మంచిది!


రాజధానిలో జరుగుతూన్న పరిణామాలు తలుచుకుని రాజు కలవరపడ్డాడు.
ప్రభూ! ప్రస్తుతం రాజభవనం కాపలా నరేంద్రదేవుడి చేతుల్లో వుంది.
పరిస్థితి అంత దారుణంగా ఉందా? నేను వెంటనే...
... రాజధానికి తిరిగివెళ్ళాలి! నువ్వు రాజభవనంలో విశ్వాసపాత్రులైన అంగరక్షకులను ఏర్పాటు చెయ్.


... పైగా మనకు
విశ్వాసపాత్రులైన వారందరినీ
తొలగించాడు; మిగిలినవారిని
జైల్లో పెట్టాడు.


అందువల్ల, నరేంద్ర,
రవీంద్రదేవుల బెడద
తీరేంతవరకు ప్రభువులు
రాజధానికి తిరిగి వెళ్ళకుండా
ఉండడమే క్షేమం.


వాళ్ళ సంభాషణలు వింటూ సమీపించిన
అరుణ, ఆదిత్యుడి మాటకు అడ్డువచ్చింది.
వీరబాహు, తన
గూఢచారులు తీసుకు
వచ్చిన సమాచారంతో
వెలుపల ఉన్నారు.
లోపలికి రమ్మని
చెప్పు.


ఏదైనా
మాయమంత్రాలు
ప్రయోగించి
రాజుగారిని తనకు
వశుడై ఉండేలాగా
చేయమనీ,
నిన్ను
హతమార్చమనీ
సేనాధిపతి,
అంతేనా?
మరేదైనా ఉందా?
తాంత్రికుణ్ణి
ప్రార్థించాడట!


వాడు రాజద్రోహి!
వాణ్ణి బంధించాలి!
బహిరంగంగా
ఉరితీయించాలి!
మరొక కొత్త ప్రాంతానికి తీసుకువెళతానని
ఆదిత్యుడు సలహా ఇచ్చాడు.


వద్దు. నేను రాజభవనానికే
వెళతాను. ప్రజలే నా బలం.
ఇకపై క్షణం కూడా వాళ్ళకు
దూరంగా
ఉండదలుచుకోలేదు.
తమ
అభీష్టానుసారమే
చేయండి
ప్రభూ!


కుట్రదారులకు వ్యతిరేకంగా అందరూ ఐకమత్యంగా ఉండాలని ప్రజలకు విజ్ఞప్తిచేస్తాను...
... వాళ్ళ సమక్షంలోనే నా విధి వ్రాతను ఎదుర్కొంటాను.


వీరబాహూ! నువ్వు ముందే వెళ్ళి నేను త్వరలో రానున్నానని ప్రజలకు తెలియజెయ్యి.
చిత్తం, ప్రభూ!


వీరబాహూ! రాజుగారి ప్రయాణానికీ, రక్షణకూ తగిన ఏర్పాట్లు చెయ్.


ప్రభూ! నేను రాజధానికి వెళ్ళి రాజభవనానికి తమ పునరాగమనాన్ని ప్రజలకు ప్రకటిస్తాను. అరుణ మీకు తోడుగా వస్తుంది.


దుష్టశక్తుల నుంచి రాజుగారినీ, నా మాతృభూమినీ సంరక్షించాలి!
ఇంకావుంది



వ్యాఖ్యలు
రాయండి!

# ఫోటో వ్యాఖ్యల పోటీ





ఈ ఫోటోలకు ఒక్క మాటలోగాని, చిన్నవాక్యంలోగాని వ్యాఖ్యలు
రాయగలరా? రెండు వ్యాఖ్యలకూ సంబంధం ఉండాలి.

వ్యాఖ్యలను కాంపిటీషన్ పోస్ట్‌కార్డుపైన రాసి ఈ నెల 25వ తేదీలోగా మాకు అందేలా పంపాలి.పోటీ ఫలితాలు ఆగస్టు 2002 సంచికలో ప్రచురిస్తాం. ఉత్తమమైన వ్యాఖ్యకు రూ.100 బహుమానం.

ఫోటో వ్యాఖ్యల పోటీ: చందమామ, 82,డిఫెన్స్ఆఫీసర్స్‌కాలనీ,
ఈకాట్టుతాంగల్, చెన్నయ్ -600 097.

## అభినందనలు

ఏప్రిల్ 2002 సంచికలో బహుమతి
పొందిన వ్యాఖ్యలు పంపినవారు:
అవని,
ఇం.నెం.5-12-67
విద్యారణ్యపురి.(అం.ప్ర)




మొదటి ఫోటో: ఆహా! బతుకుతెరువుకోసమండి!
రెండవ ఫోటో: ఓహో, ఇది బత్తాయిరసం బండి!

చందమామ సంవత్సరచందా:
ఇండియాలో రూ.120లు

Payment in favour of CHANDAMAMA INDIA LIMITED
No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097

Printed and Published by B. Viswanatha Reddi at B.N.K. Press Pvt. Ltd., Chennai - 600 026 on behalf of Chandamama India Limited, No. 82, Defence Officers Colony, Ekkatuthangal, Chennai - 600 097. Editor : Viswam

